శ్రీ

# భీమప్రతిజ్ఞ

(ఆరంకముల నాటకము.)

గ్రంథకర్త:
క. కోదండరామయ్య

ప్రకాశకులు (ఈకూర్పునకుమాత్రమే):
కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ.

మూడవకూర్పు : 1000 ప్రతులు



వెల రు. 0-12-0.

A. G. Press,
Bezwada.

| ఆంధ్రనాటకములు | | |
|---|---|---|
| **బళ్లారి ధర్మవరం కృష్ణమాచార్యులవారిచే రచియింపంబడినవి.** | | |
| చిత్రనళీయము | రు 1 | 6 |
| విషాద సారంగధర | 1 | 6 |
| పాదుకా పట్టాభిషేకం | 1 | 6 |
| ప్రమీలార్జునీయము | 1 | 2 |
| చంద్రహాస | 1 | 2 |
| ప్రహ్లాద | 1 | 2 |
| సావిత్రీ చిత్రాశ్వము | 1 | 2 |
| రోషనారా శివాజి | 1 | 2 |
| ముక్తావళి | 1 | 2 |
| బృహన్నల | 1 | 2 |
| పాంచాలీ స్వయంవరం | 1 | 2 |
| మోహినీ రుక్మాంగద | 1 | 2 |
| వరూధిని | 1 | 2 |
| చిరకారి | 1 | 2 |
| **బళ్లారి పండిత కె. సుబ్రహ్మణ్య శాస్త్రిలుగారిచే రచింపఁబడిన** | | |
| సంపూర్ణమహాభారతము | 1 | 4 |
| జ్ఞానకృష్ణలీల | 1 | 4 |
| కృష్ణలీల | 1 | 6 |
| లవకుశ | 1 | 6 |
| **బళ్లారి ధర్మవరం గోపాలాచార్యులుగారిచే రచింపఁబడినవి.** | | |
| రామదాసు | 1 | 2 |

| ఆంధ్రనాటకములు. | | |
|---|---|---|
| రామ్‌కబీరు | రు 1 | 4 |
| కన్యాశుల్కము గు॥అ॥ | 1 | 4 |
| ప్రతాపరుద్రీయం వే॥ వేం॥ | 1 | 8 |
| **బళ్లారి కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచియింపఁబడినవి.** | | |
| ఫాలాఫ్ విజయనగర్ | 1 | 4 |
| సుల్తానాచాందుబీ పాలాఫ్ అహమ్మద్ నగర్ | 1 | 4 |
| శిలాదిత్య (హిస్టారికల్ ట్రాజడి) | 1 | 0 |
| శిలాదిత్య గెహుని పట్టాభిషేకము | 1 | 0 |
| ప్రతాపాగ్బరీయము | 1 | 0 |
| సునందనీ పరిణయం | 1 | 4 |
| సుఖమంజరీ పరిణయం | 1 | 0 |
| యువతీ విజయము | 1 | 0 |
| సీమంతినీ పరిణయం | 1 | 0 |
| మదాలసా నాటకం | 1 | 0 |
| రుక్మాంగద | 1 | 4 |
| సత్య హరిశ్చంద్ర | 1 | 4 |
| గిరిజా కల్యాణము | 1 | ( |
| ప్రహ్లాద చరిత్ర | 1 | 4 |
| ద్రౌపదీ మానసంరక్షణం | 1 | 4 |
| కీచక వధ | 1 | 0 |
| భారతయుద్ధం లేక ధర్మవిజయము | 1 | 0 |

శ్రీ హయగ్రీవాయనమః

# భీమప్రతిజ్ఞ

(అయిదంకముల నాటకము)

గ్రంథకర్త:

కర్లపాలెము కోదండరామయ్య

విక్రయ హక్కు స్వాధీనకర్తలు:

కురుకూరు సుబ్బారావు,

బుక్కు-సెల్లర్, బెజవాడ.

మూడవ కూర్పు: 1000 ప్రతులు.

బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు
క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడినది.

1928

 [వెల అ. 12

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

పురుషులు:—

| | |
|---|---|
| ధర్మరాజు | ఘటోత్కచుఁడు |
| భీముఁడు | దుర్యోధనుఁడు |
| అర్జునుఁడు * | కర్ణుఁడు |
| నకులుఁడు * | ద్రోణాచార్యులు |
| సహదేవుఁడు | అశ్వత్థామ |
| ధౌమ్యుఁడు * | శకుని * |
| ఆంజనేయుఁడు | నలకూబరుఁడు * |
| నారదుఁడు | మణిభూషణుఁడు * |
| గంధర్వులు * | బ్రహ్మ * |

స్త్రీలు:—

ద్రౌపది

నటి.

* ఈపాత్రములకు చదువవలసిన భాగము (portion) చాల కొద్ది. ఈ 8 పాత్రలు చాలవరకొక్కఁడే వేయవచ్చును. సందర్భమును బట్టి మరికొన్ని పాత్రముల గూడ నిట్టె ప్రదర్శకులు నిర్ణయించుకొన వీలగును. కావున ప్రదర్శకులు హెచ్చుపాత్రలని సందేహపడ నక్కరలేదు.

# పండితాభిప్రాయము

భీమప్రతిజ్ఞయను నాటకమును సాంగముగఁ బరిశీలించితిని. శైలిమృదువయి నాటక ప్రేక్షకులకు సుబోధమై యున్నది. కథావిధానము తత్తదుచితశబ్దార్థ ప్రసంగాది భూయిష్ఠమై సమంజసముగా నున్నది.

10—7—1914.

పురాణం రామచంద్రశాస్త్రి,
ముక్త్యాల జమీందారుగారి ఆస్థాన పండితుఁడు.

# IN MEMORY

### OF

## MY BELOVED FATHER

### LATE

# Karlapalem Kamiah Pantulu.

కీర్తిశేషుండైన నాప్రియజనకుండు

## కర్లపాలెము కామయామాత్యుని

జ్ఞాపకార్థము.





శా. శ్రీలక్ష్మీసతి సాంద్రభక్తిగరిమన్ ♦ సేవింపుచుండన్ దగన్
నీళాభూసతు లిద్దఱున్ దనను బల్ ♦ నేస్తంబునన్ గొల్వఁగా
హేలాదృష్టిపరంపరల్ మువ్వురిపై ♦ నేకాకృతిన్ బర్వు నా
శ్రీలానీళలభర్త మీ కొసఁగుఁ దం♦డ్రీ! శాశ్వతానందమున్.

# కవి జీవితము

ఈ కవి ఆరువేలనియోగిబ్రాహ్మణుఁడు. హారితసగోత్రసంభవుఁడు. ఇంటిపేరు కర్లపాలెమువారు. తండ్రి రామయ్య, తల్లి నర్సమాంబ, భార్య రాజ్యలక్ష్మమ్మ. ఈ కవి శాలివాహనశకము 1784 సంవత్సరమున జన్మించె. వీరన్నదమ్ములు నల్వురు, సోదరీలిరువురు. వీరి కాపురము గుంటూరుమండలమునందలి బాపట్లతాలూకాలోని కర్లపాలెమను గ్రామము. వీరిది విద్వత్కవిసాంప్రదాయము. కృష్ణామండలమునందలి కయికలూరుతాలూకాలో చేరిన పడాలి గ్రామమునందు శ్రీ జగన్నాథస్వామివారి దేవాలయము ప్రతిష్ఠించి నవాబు నిజాముద్దౌలాగారివలన ఆగ్రామము స్వామివారికి జాగీరుగా సంపాదించిన "కర్లపాలెము నారాయణసోమయాజి" అను శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీపురుషోత్తమానందావధూత వీరివంశములోనివారే. ఈకవి ముత్తాతయగు నరసింగయ్యగారు మంచికవి; కొన్నిగ్రంథములు రచియించెను. ఇప్పుడు తత్కృతమగు నరసింహశతక మొకటి కనుపించుచున్నది. తాతగారగు రామన్నగారు పండితుఁడును, వీరి పెదతండ్రి నరసింహముగారు కవియును, పండితుఁడును, పినతండ్రి బుచ్చయ్యగారును కవియే. ఈ బుచ్చయ్యగారు వ్రాసిన పంక్తిమానవాద మొకపత్రికలో ప్రచురమైనది. ఇంతియేల! ఈకవివంశజు లందఱు మంత్రములమీఁద జక్కని విశ్వాసముఁ జెప్పుటయందు సమర్థులు. ఇట్టి విద్వత్కవిసాంప్రదాయమునందు జనించిన వీరికిఁ గవిత్వశక్తి గలుగుట యబ్బురము కాదు. ఈకవి మొదట వ్రాసినది "కాంత" యను చిన్నపొత్తము. ఇందు స్త్రీలకు వలయు నీతులు, ధర్మములు చక్కనిశైలిని పద్యరూపముగా వ్రాయఁబడినవి. ఇది విద్యాశాఖవారిచే నంగీకరింపఁబడి, బాలికాపాఠశాలలయందు పఠనగ్రంథమై యచిరకాలమున నాలుగుముద్రణములంది చాల వ్యాప్తియు, గౌరవము నందినది. పిమ్మట "భీష్మప్రతిజ్ఞ" యను నీనాటకము రచించెను. ఇందలి శైలి మిక్కిలి మృదుమధురము. పాకము బహిరంతస్స్ఫురద్రసమగు ద్రాక్షాపాకము. మిక్కిలి సరసమైన సరళప్రవాహముతో కవిత్వధోరణి గలది. పాత్రచిత్రములు, రసప్రవాహములు జక్కఁగఁ బోషింపఁబడినవి. ప్రదర్శనానుకూలమగు పంధానున మనోహరమగు సంవాదశుద్ధి కలిగియున్నది. కుడువఁబోవువారలకుఁ గూరలరుచి రుచిచూపించునట్లు ఇందలి గుణాగుణవిమర్శన మతిప్రసంగమగునని పాఠకులే ఇందలి మాధుర్యమును గ్రోలి యానందింపఁగల రని యింతటితో విరమించెదము.

అంగలూరు,
15—4—1914.

ఇట్లు,
శివ వేంకటకవులు.

{ అడవి సాంబశివరావు.
నందగిరి వేంకటప్పారావు. }

## విజ్ఞప్తి



ఆర్యులారా!

నాటకరచన కిదియె నాప్రప్రథమోద్యమముగాన నిందు పెక్కు దోషములుండక మానవు. కావున నిందుగల దోసఁగుల ద్రోచిపుచ్చి, సుగుణములు గలవేని వాని గ్రహించి నన్ను ధన్యుంజేయ సుజనాళి కంజలిఁ జేయువాఁడ.

మచ్ఛ్రేయోభిలాషులగు చదువరు లిందలి లోపముల దయతో నాకుఁ దెలియఁ బఱచినయెడల, వానిని వందనపూర్వకముగ నందికొని కొత్తకూర్పునందు సవరించుకొనియెద.

బెజవాడ,<br>10—8—1914.

ఇట్లు సుజనవిధేయుఁడు,<br>కర్లపాలెము కోదండరామయ్య,<br>గ్రంథకర్త.



## తృతీయముద్రణము.



ప్రథమముద్రణమును "సౌగంధికాపహరణ"మను పేరున ప్రచురించితిని. ద్వితీయముద్రణమున నెక్కుడు మార్పులఁజేసి గ్రంథనామమును "భీమప్రతిజ్ఞ"యని మార్చితిని. ఆప్రతు లయిపోవుటచే నీ తృతీయముద్రణ మొనరించితిని. భీమ, ఘటోత్కచ, ఆంజనేయుల పాత్రలు ధరించి ప్రజారంజకముగా ప్రదర్శించిన ప్రసిద్ధనటకులకు యోగ్యతానుసారముగ పతకము లొసంగబడును. గ్రంథకర్తయొక్క వ్రాతమూలకమైన యనుమతి లేనిచో యే నాటకశాలవారును ప్రదర్శింపగూడదు.

—గ్రంథకర్త.



శ్రీహయగ్రీవాయనమః

# భీమప్రతిజ్ఞ

## నాంది.



శ్రీ భూనీళలు చేఁకోల్వ దివిజ, శ్రేణుల్ నుతింపన్ గృపా
శ్రీభూత స్వశుభావలోకనరుచుల్ దీపించు వెన్నుండు మ
త్తేభేంద్ర ద్రుపదాత్మజారిబలక్షులెం దేనిన్ సుఖంబంద నే
మే భావంబులఁ బ్రోచెఁ; బ్రోచు నటు మిమ్మిష్టార్థ
[సంధాయియై.

ఉ॥ కోరకమీఱఁగాఁ దనదు కోమలికిం బ్రియమున్ ఘటింపఁగాఁ
గోరి సురాళితోడ నతిఘోర రణం బొనరించి మించి, యం
భోరుహనేత్రికిన్ వనజముం గొనితెచ్చి యొసంగు సత్యభా
మారమణుండు ప్రోచు నసమాన శుభాభ్యుదయాప్తి సభ్యులన్.

(నాంద్యంతమునందు)

సూత్ర—సకలకలాపరిపూర్ణు లగు సభాసదుల కానందం బీనాటక ప్రదర్శనంబునం గలుగఁగలదు! (ఆలోచించి) ఏమీ, స్ఫురణకు రాకున్నయదే! నా యర్ధాంగిని రావించియైన నాలోచించెదఁగాక! —ప్రేయసీ! సత్వరముగ రమ్ము.

(తెరలో "వచ్చుచుంటి" నని ధ్వని వినఁబడును.)

ఏమీ, వచ్చుచుంటినని పల్కుచు నింకను రా నాలసించెనే! ఛీ! చేయఁబూనిన కార్యము నెఱవేరినఁగాని యాఁడువారు మఱియొక కార్య మూహింపరుకదా!

చ॥ అవసరమెంతయో కలిగి • యాతురతన్ సతి! రమ్మటన్నఁ, దా
నవసర మించుకేని మన•మందుఁ దలంపదు జ్ఞానశూన్యయై;
యువిదలు మూర్ఖతన్ మదిని • యోజనఁ జేయరు కార్యకార్య
ముల్ భువిఁ దమ పంతమే సఫల•మౌఁగనఁ జూచెద రెట్టివేళలన్.

నటి—(ప్రవేశించి) నాథా! నా యాలస్యమునకు క్షమింప వేఁడెద. నన్నుఁ బిలిచిన కారణం బెయ్యది?

సూత్ర—ప్రేయసీ! ఇప్పు డేదేని నవీనరూపకం బొందు ప్రదర్శించి, యీ సభాస్తారుల మనంబులు రంజిలఁ జేయ నెంచితి. కాని, యెద్ది ప్రదర్శింతునా యని యోజింపుచుంటి. కావున నీకుఁ దోఁచినచో నొకదాని నెఱింగింపఁగోరెద.

నటి—నాథా! నామది నొక కోర్కె గలిగె. దాని నెఱవేర్తు మంటిరేని నీ సభ్యుల కామోదదాయకం బగు నాటకం బొండు యోజించెద.

సూత్ర—సఖీ! ప్రసన్నమితబలోన్నతుం డగు భీమసేనునంతటి మేటి ద్రౌపదీ మనోభీష్టం బీడేర్ప నెంచి, కడు నిడుమలఁ గుడిచియుండ, నా యంతటివాఁ డెట్టులఁ దీర్పఁగల్గు? ముం దెఱింగింతువేని యాలోచించెద.

నటి—నాథా! ద్రౌపదీ మనోభీష్టం బీడేర్ప భీమసేనుండు కడు నిడుమలఁ గుడిచెనా? ఆ లేమ తా నేమి కోరె? భీముం డెట్టుల దానిఁ దీర్చె?

సూత్ర—సఖీ! అదియంతయు విపులంబుగఁ దెలుపుట కిదియా తరుణము? సదస్యు లిట్టి కాలయాపనమునకు సహింతురా? దాని నెఱుంగఁ గోరుదేని భారతమునం జూడుము.

నటి—ఏమీ! భారతమున, నేపర్వంబున?

సూత్ర—ఆరణ్య పర్వంబున.

నటి—ఓహో, సౌగంధికముం దెచ్చియిచ్చిన కథయా?

సూత్ర—ఔను.

నటి—దీనికై యీ మహాభారతముం దిలకింప నేల? ఆకథ రూపకంబుగనే రచియింపఁబడి యున్నదికదా! దాని మీ రెఱుంగరా యేమి?

సూత్ర—ఆఁ నిజము. జ్ఞప్తికివచ్చినది. "భీమప్రతిజ్ఞ" కాదా? దాని రచించిన ప్రాజ్ఞుని పేరు స్ఫురణకు రాకున్నయది. (ఆలోచించి) ఆఁ!

మ॥ హారితాభిఖ్యమునీంద్రగోత్రజుఁడు, కా♦మామాత్యనర్సాంబికా
వరపుత్రుండును, కర్లపాలెకులుఁ, డా♦పస్తంబసూత్రుండు, స
ద్గురుపాదాబ్జమనోమిళిందుఁ డగు నా♦కోదండరామార్యుఁ డో
తరుణీ! దాని రచించి మించెఁ గవితా♦తత్త్వజ్ఞు లౌరా యనన్.

నటి—నాథా! ఈనాటకమునే ప్రదర్శింపనగును. కాని యీకవి బాలుఁడే! బాలునికవిత్వము సభ్యులఁ దనియింపఁగలదా! వృథాశ్రమ యగు నేమోయని సందియము. మీ రేమనియెదరు?

సూత్ర—ప్రేయసీ! బాలుఁడనియా సందియము? ఏస్థలమున నేనిక్షేప మున్నదో యెవ్వఁడెఱుంగు? "బాలాదపి సుభాషిత" మ్మనునట్లీ బాలునికావ్యమును గుణగ్రహణపారీణులగు రసికశ్రేష్ఠులు ప్రశంసించియే తీరుదురు. మఱియు వస్తుగుణవివేచనమునకుఁ బ్రాచీన నూత్నభేదము లనవసరములు.

గీ॥ అనఘమతు లెందు గుణమున♦ కభిలషింతు
రంతియేకాక, ప్రాచీన♦ మద్ది, నూత్న
మిద్దియని యెంచఁబోవ, ర♦హీనమైన
రత్నమును గావ్యమును నొక్క♦ రాశి యగుట.

అందు నిది పంచమవేద మనంబడు భారతమునందలి సుప్రసిద్ధమగుకథ. సఖీ! యింక వృథాకాలయాపనముచే సదస్యుల యాగ్రహమునకుఁ బాత్రులమగుదుము. కావున నీవుచెప్పినట్లు నేటికీ బాలకవి నాటకమునే ప్రదర్శించి సభ్యులకు విందుఁగొల్పుదము. మనోహరమగు నొక్క ఋతువర్ణనము సేయుము.

నటి—మంచిది.

చ॥ జలజములెల్ల భానుకర♦ జాలములన్ వికసించె, దక్షిణా
నిలపృథుకంబు నీరజవ♦నీభవగంధములం దెమల్చి పాం

ఖులకుఁ బ్రమోదమిచ్చె; శ్రమఁ • దూఁగిన పూరుషులున్ సతీమతల్లులు వనవాసమున్ సలుప • లోలుపులైరి వసంతవేళలన్.

సూత్ర—నటీ! నీగానమాధుర్యమునకును, వర్ణనాచాతుర్యమునకును సంతసించితి. (తెరవంకఁ జెవియొగ్గి) ప్రేయసీ! అరణ్యవాసక్లేశమును భరింపఁజాలక డస్సిన మేనితో శ్రమాపనయనమునకై చింతించుచున్నట్లు సమీరకుమారుం డదే వచ్చుచున్నవాఁడు. ఇంక మనము వెళ్ళుదము రమ్ము.

నటి—సమీరకుమారుం డన నేనొనర్చిన వసంతఋతువర్ణనమునందలి మలయసమీరకిశోరమా యేమి?

సూత్ర—కాదుకాదు. దుష్టమతియగు శకుని ప్రేరణంబున నొనర్పంబడిన మాయాద్యూతంబునఁ గలిగిన యవమానంబుచేఁ బంచపాండవులు పదిరెండేడు లరణ్యవాసక్లేశ మనుభవింపవలసివచ్చె. సహజసుకుమారులగు నాపాండునందనులం దిప్పు డట్టి యరణ్యవాసభరంబునఁ దూఁగుటంజేసి తనపడు బన్నంబులకుఁ జింతిల్లుచుఁ దచ్ఛ్రమాపహరణాసక్తుండై ధర్మరాజానుజుం డగు భీముం డదే చనుదెంచుచున్నవాఁడు. కావున బోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.



శ్రీ హ య గ్రీ వా య న మః

# భీ మ ప్ర తి జ్ఞ.

---

## ప్ర థ మాం క ము.

రంగము – బదరికావనము.

(ప్రవేశము: భీముఁడు.)

భీము—

ఉ॥ అన్నయుఁ దమ్ములున్ సతియు నారడిఁజెంది వనంబు నందు నా
పన్నులయట్లు బన్నముల పాల్పడి రక్కట! భీమపార్థు లి
ట్లున్నతి దక్కి బేల లయి యుండిరిపో, గహనప్రవాస మి
ట్లెన్నిదినంబులన్ సలుప నెంచెనో? హా! విధి, దుష్టబుద్ధియై.

"మనోభూషా హర్ష"మ్మనునట్లు మనస్సునకు సంతోషముగదా భూషణము. కాని నా కిట్టి కష్టదినములలో సంతస మెట్లు కలుగును?—ఈ వసంతసమయమున వనవిహార మొకింత హృదయాహ్లాదముఁగలిగింపనోవు. కావున నన్నగారి సెలవుఁగైకొని యరిగెదఁగాక!

(నిష్క్రమించును.)

---

(ప్రవేశము—ధర్మజ భీమ నకుల సహదేవ ధౌమ్య ద్రౌపదులు)

ధర్మ—తమ్ముఁడా! అటులనే చని సత్వరమున రమ్ము. అట జాగు సేయకుము.

భీము—చిత్తము. (గదయు నంబులపొదియు శంఖము గొని పోవుచుండ)

ద్రౌప—(భీముని జేసన్న నిలిపి ధర్మజుఁగాంచి) మహాభాగా! నేఁడు తమ యనుజుని వెంటఁ జని వనవిహారణోత్సవమునఁ బాల్గొనఁ గోరెద. కావున నాముద్దును జెల్లింపఁ బ్రార్థించెద.

ధర్మ—కాంతాలలామ! అటులనే చనవచ్చును కాని, యొంటిగ భీముం డేఁగుచుండె. అతని వెంట నీవును జన, దైవప్రతికూలమున నేదే నొక దుర్ఘటకార్యము సంభవించిన మీ రిరువురు నిక్కటులు లొందవలసివచ్చునేమో యని సంశయ మగుచున్నయది. అదికాక మీర లిర్వురుఁజన నొకింత కాలహరణంబును గనోపు. నిరతము మనల నిర్మూలింప దుర్యోజనల సేయు దుర్యోధనుం డేపన్నుగడఁ బన్ని మన పైఁబడునోకదా! విడివడియున్న మన కేముప్పువచ్చునో! కావున మనము చీలియుండకుంట శ్రేయోదాయకము.

భీము—అగ్రజా! ఏల మీ రిత్తెఱంగున సంశయాస్పదులరై పల్కెదరు? ఈలేమ నావెంటవచ్చినఁ గాపాడుకొని రాఁజాలనా?

మ॥ నరనాథాగ్రణి! మీయనుజ్ఞయయినన్ ♦ నాకెద్ది దుస్సాధ్యమీ
ధరణిన్ నన్నొక దుర్బలాత్మునిక్రియన్ ♦ దారెంచి దైన్యంబు నీ
కరణిన్ బూనఁగనేల? యొక్కగుడి మిర్రింగన్ శక్తుఁడై నట్టియే
నరుఁడైనన్ వెలిపందనేర్చునె తదంతర్లింగమున్ మిర్రంగఁగన్.
అదియునుంగాక,

మ॥ ఉన్నది తెల్పెదన్ వినుమ, హేమాజ్వలకీర్తివిశాల! నిన్ను నేఁ
గన్న మదిన్ భయంపడుదు ♦ గాని మరొక్కనిఁ గాంచి భీతినేఁ

గన్నదిలేదు స్వప్నమును • గాంచెడు పట్టుననైన; నిక్కువం
బెన్నటికైన జాతికిల • నేర్పడునే గిలిగింత లెంతయుఁన్.

మఱియు,

మ॥ కురురాజుంగని మీర లెంతయు మదిన్ • గొండంతగా నెంచి యా
నరనాథాధము శౌర్యమున్ దలఁచి యన్ • న్నా! భీతిమై మీర లీ
కరణిం బల్కఁగ నేల? యాతనికిఁగాఁ • గన్ దోడు గంధర్వకి
న్నరు లేతేరిన నే నెదుర్కొని రయా • నం బర్వు లెత్తింపనే?

కావున సందియం బుడిగి యీకుందరదన మనోభీష్టం బీడేర్పఁ బ్రార్థితులరు.

ధర్మ—భీమన్నా! నీ వంతటివాఁడవే యగుదువు. కాని,

చ॥ అరయఁగ నొక్కసందియము • నందెద నీమానాక్షి కోరికల్
నెరప నశక్యమైనయవి • నీమది నెంచినయట్లు కాదు; భీ
కరతర యక్షరాక్షస ని • కాయములుండెడు నీవనంబునం
దరుణినిఁగూడి యొంటి మెయిఁ • దమ్ముఁడ! పోవుట కష్టసాధ్యమౌ.

మఱియు మన యర్జునుండుకూడ మత్సాన్నిధ్యమున లేకుండుటయుఁ బోసంగె. కవలన్నన్నో బాలప్రాయులు. ఇట్టియెడనొంటిగ నాఁడుదానింగొని నీవు చనుటయు, మే మిట మిన్నకుండియుండుటయు సమంజసమా? దుర్యోధనునిదుస్తంత్రంబులు నీ వెఱుంగవా? కావున భీమసేనా! నీవిపు డొంటిగ నేగుటయే లెస్స.

భీమ—అన్నయ్యా! మీ రిట్లేల సంకోచించెదరు? సుయోధనుం డొకఁడనేల? త్రిమూర్తు లొక్కుమ్మడి నెదిరించినను మాకు లెక్కయా? అదిగాక,

చ॥ అసురపురంబునుండి మన • యర్జునుఁ డిప్పుడె రాఁగలండుసూ;
శమనకుమార! దుష్టగుణ • శాలి సుయోధనుఁ డిందు వచ్చుచో
నమితబలాఢ్యులైన కవ • లాతని పీచమడంచ లేరె?—పా
పము గనుఁగాదె వల్లభుఁడు • పత్నియభీష్టము దీర్పకుండినన్.

ఇవి తమకు సంవేద్యంబె! కావున,

గీ॥ కరుణతోడుత నీదంతి♦గమనకోర్కెఁ
దీర్ప సెలవిండు; వెరపేల ♦ ధీవిశాల!
కష్టములె వచ్చునేనియుఁ ♦ గడప మనకుఁ
దోడునీడగఁ గృష్ణుండు ♦ లేఁడె! యనఘ!

ఇపుడు మీకుఁ దోడుంగ.

చ॥ ఉరుతర బాహువిక్రము ఘ♦టోత్కచు నియ్యెడ నిల్పువాఁడ నే
మరకయె కొల్చునాతఁ డణు♦మాత్రము సంశయమందఁ బోక; యీ
సరసిజపత్రలోచనను ♦ జయ్యన నాతెను వెంట నంప నా
దర మలరార వేఁడెద నెదన్ గరుణింపు కృపాపయోనిధీ!

(అని పాదముల వ్రాలును.)

సహ—(ధర్మజు నుద్దేశించి) అన్నా! సుగుణసంపన్నా!

చ॥ ధరఁగలరాజసత్తములఁ ♦ దావకకీర్తి మహాప్రతాపముల్
పరమసముజ్జ్వలంబులు, ప్ర♦భంజనపుత్రుని బాహువిక్రమ
స్ఫురణ దిగంతవిశ్రుతము, ♦ పూజ్యుఁడు ఫల్గునుఁడెన్న నాజిలోఁ
బురహరుగెల్చి పాశుపత♦ముం గొనఁజాలిన శౌర్యశాలియౌ.

మఱియుఁ బరమమిత్రుండును బాంధవుండును నగు వెన్నుండు మనపాలంగలుగ మనకేటి వెఱపు? భవదాజ్ఞాబద్ధులై యొక్కింత వెఱపుగలిగియుందురు గాని లేకున్న మీసోదరు లెదుర్కొన నా సుయోధనుం డన నెంత; వాని సైన్యమన నెంత? దేవగణంబులెల్ల నొక్కుమ్మడి యెత్తివచ్చినను నీయనుజులం దొక్కఁడొక్కఁడ వారిం బారఁదోల సమర్థుండు. అట్టియెడ శక్తిసామర్థ్యంబులఁ దలంపక యీరిట్లు తలపోయనేల? కాదనక ద్రౌపదిం గొనిచన సెల వొసంగుఁడు.

సహ—అన్నయ్యా!

గీ॥ వెఱపుమెయి మాతృగర్భంబు ♦ జొరఁబడినను
తుదకు రాఁగలకష్టముల్ ♦ తొలఁగఁగలవె?

రామరాణ్మణియును, నలరాజు తొల్లి
తలఁపశక్యులై రె? విధివ్రాలుఁ దొలఁగ నగునె?

ఇట్టి రహస్యంబులు తామెఱుంగనివి కావు. రాజకార్యంబులెందున్నను రాక తప్పవుకదా! అదియునుంగాక,

గీ॥ ఎప్పటి కెయ్యది రాఁగల
దప్పటికది రాకయున్నె? యనఘా! యెదిరే
ముప్పు ఘటిల్లిన దానిన్
దప్పింపఁగ లేదె మీఁద దైవం బెపుడున్.

మన భీమన్నకూడ ద్రౌపదిం దోడ్కొని చన మిగులఁ గుతూహలాయత్తచిత్తుండై యున్నటులఁ గన్పట్టెడిని. కావున వారిరువురి ముద్దును జెల్లింపఁదగును. ముమ్మాటికి దియే నావిన్నపము.

ధర్మ—(సహదేవుని నక్కునఁ జేర్చుకొని) అనుజా! చిన్నవాఁడవయ్యు బుద్ధినిఁ బెద్దవాఁడవగుదువు. నీవాడినది బహుదూరము యోజింపఁ దగినది. కాని,

గీ॥ ఒంటరిగఁ గృష్ణ భీముని వెంట నెట్లు
బంపనగుఁ; బంపకుండినఁ బడఁతి కినియుఁ
బంపఁగ నట నేమౌనో చెప్పంగరాదు
తలఁపఁ గీడెంచి మేలెంచ వలయుఁగాదె?

కాంతారమునందు వైషమ్యదోషమున నీక్షేమ మే యలమటఁ బొందునోకదా! దైవము పగవారియెడఁ గలండు. ఏమి సేయుదు!

ధౌమ్య—పాండునందనా!

ఉ॥ ఇంతటి స్వల్పకార్యమున కీవిటు చర్చ నొనర్చ దేల? యీ
కాంతను గూడి భీముఁడిదె కానకు నేఁగి విహారసౌఖ్యముల్
సంతసమందఁగాంచి సుమసంతతులన్ ఫలకందమూలముల్
వింతగఁ గూర్చి మీకడకు వేగమ వచ్చెదుఁ గానఁ బంపుమా.

ధర్మ—విప్రకులావతంసా! మీరును నందులకనుకూలముగఁ బలుకుట చే నా సంశయములెల్లఁ బటాపంచలైనవి. ఇంక మీ నుడువు వడువున నడచుకొనుచున్నాఁడ. (భీముంజూచి.)

ఉ॥ తమ్ముఁడ! భీమసేన! విను • ద్రౌపది నీవెనువెంటవచ్చు; నీ
వెమ్మెయిఁజూచెదో; అబల ; • యేమఱియుండెదు సుమ్ము; ఘోరవ
న్యమ్ములుగల్గు నీవనము•నందునఁ, గంటికి ఱెప్పరీతి నీ
కొమ్మను గాచికొమ్ము మరి • గొబ్బునరమ్మిటు మమ్ముఁజేరగన్.

భీము—అన్నా! అటులనే నడచుకొనియెద.

ధర్మ—సత్వరము మరలిరమ్ము.

భీము—చిత్తము.

ద్రౌప—అహ్హా! సెలవుఁ గైకొనెద.

ధర్మ—మంచిది. భీమునితోడ నతిజాగ్రతగ నుండుము. జాగుసేయకుఁడు.

భీము—(నకులునిఁ జేసన్నఁబిలిచి చెవిలో నేదియో చెప్పి చేతిలోఁ జేయి వైచును.)

(భీమ ద్రౌపదులు నిష్క్రమింతురు.)

ధౌమ్యు—పాండవాగ్రణీ! నేనును బోయివచ్చెద.

ధర్మ—చిత్తము. (నమస్కరించును.)

ధౌమ్యు—దీర్ఘాయుష్మాన్భవ! (నిష్క్రమించును.)

ధర్మ—(స్వగతము)

ఉ॥ మానినిఁగూడి తాఁజనియె • మారుతి ఘోరవనాంతదుర్గముల్
గానఁగ; నందు యక్ష సుర • గారుడ ఖేచర రాక్షసావళుల్
మానక యుండు; కృష్ణ యస•మాన సురూప ; మదిన్దలంప నే
మానొకొ? విత్తమం దతివ•లం దనురాగము మెండెవారికిన్.

యక్ష కిన్నర గంధర్వ ఖేచర నిశాకరబింబముఖుల నైన సరకు సేయని మహాసౌందర్యశాలిని యీ పాంచాలి!

సీ॥ చంద్రవిలాసంబు ♦ సరకుసేయక కేరు
ముదిత లేనగవు నెమ్మొద్దుమొగము
కనకంబుఁ దరిఁజేరఁ♦గానీదు సరియని
నాతి మైకాంతియు ♦ నాసికంబు
కువలయానందంబు ♦ గోట మీటఁగఁజాలు
నెరజాణ పిరుదులు ♦ నేత్రయుగము
సారంగ విభవంబు ♦ సారహీనము జేయు
చాన యానంబును ♦ వేణిభరము
ఆ విలాసంబు రూపంబు ♦ నా చొకాట
మా యొయారంబు, చెల్వంబ♦యారె చూడ
మానివర్యుల కైనను ♦ మదిని వాంఛ
కలుగునన నింక నితరుల ♦గా భలేల?

భీమసేనుం డాకనకాంగితోడ నిట వచ్చునందాక ననుమాన మగుచున్నయది. ఏది తెరవు? (ప్రకాశముగ) నకులా! భీమ ద్రౌపదు లొంటరిగఁ జన నేదియో యనుమాన మగుచున్నయది. వారికి సాయముగ నీవుం జన మేలయ్యెడినని తోఁచెడిని.

నకు—అన్నా! భవదాజ్ఞానుసారముగ వారిం గలయఁబోఁగలను; కాని తమ యనుజ్ఞవడసి చనుచున్నతఱి భీమన్న కనుసన్నల నన్నుం జేరఁ జీరి హస్తంబుఁబట్టి,

గీ॥ "నకుల! జాగ్రత! అన్నయు♦న్నాఁడు సుమ్ము!
అన్నయున్నాఁడు జాగ్రత ♦ యన్న" యనుచుఁ
బ్రేమమెయిఁ జేతఁ జేయిడి ♦ వెడలెఁ గాన
దాని నిప్పుడు మదిలోనఁ ♦ దలఁచుచుంటి.

మఱియు,

గీ॥ కువలయాధీశ! మనమీఁదఁ ♦ గ్రోధవహ్నిఁ
బూని రారాజు; ప్రజ్వలిం♦పుదురు దానిఁ

కర్ణ శకుని దుశ్శాసనుల్ ♦ కరము మచ్చ
రమ్ము లనునట్టి సమిధలఁ ♦ గ్రుమ్మరించి.

అట్లగుట, కన్నుగల్గి మెలంగక మోసపోయి యావలఁ జింతించిన ప్రయోజనము లేదు. అనిలనందనుం డజేయుండని తామెఱుంగనిది కాదు. వారి రాకకై మీరంతగ విచారింపఁబనిలేదు. సత్వరము రాఁగలరు. కాక, యేదేనొక బెట్టిదంపు కార్యమయ్యె నేని యప్పుడ వారికై చననగుగాని యిప్పుడింతమాత్రము చనుట యుచితమని తలంప.

ధర్మ—సోదరా! నీవాడినదియు నాలోచనీయంబ. అట్టులనే కానిమ్ము చూతము. అన్నిటికిని దైవంబె కలఁడు.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము

---



శ్రీ

హయగ్రీవాయ నమః

# భీమప్రతిజ్ఞ

## ద్వితీయాంకము

రంగము—వనవిహారము.

(ప్రవేశము—భీముఁడు ద్రౌపది)

భీము—(పైని చేయివైచి ద్రౌపదితో నటునిటు దిరుగుచు) ద్రుపద రాజనందనీ!

సీ॥ కమనీయకమలినీ కల్లోలవీథుల
నడయాడు హంసల నడబెడంగు
బహువిధసుమవల్లి వప్రికరంబుల
విలసిల్లు తరులతా వితతిసొంపు
మకరందరస మాని మత్తిలి విహరించు
నళికులంబుల రవంబుల చెలువము
పరిపక్వమాధుర్య ఫలరసంబుల గ్రోలు
రాచిల్కగముల పెం రవళి సొబగు
గీ॥ పూరిగరచుచునుండ నా హ్రోల గాలి
వలనఁ జలియించు పండుటాకులకు బెదరి
కదుముల్లులై చను మృగశాబకముల మురువు
కనులండువు సేయఁగాఁ గాంచు మబల!

కాంతా! ఇంతవరకీ వనరామణీయకమును జూచుచు వచ్చితిమి. మఱియు ననేక చిత్రవస్తువులఁ గాంచితిమి. కావున;

ఉ॥ అన్నులమిన్న! అన్న వల ♦ దన్నను మానక, నన్ను శౌర్యసం
పన్నునిఁగూడి యీవనికి ♦ వచ్చితి వీవు విహారవాంఛమై;
సన్నుతిసేయఁగాఁదగిన ♦ చాయలఁ జూచితి, వింక నీయెడఁ
గ్రన్ననఁ గోరుమీ మనము ♦ రంజిలఁజేసెడి వస్తువెద్దియేఁ.

నావంటి ధీరునివెంట వచ్చి, వచ్చిన ట్లింటికి నూఱకపోవు టుచితము కాదు. కావున నీయభీప్సితము వేగ వెలిబుచ్చుము. నీవుకోరిన దెంతకష్టసాధ్యమైనను దప్పక నెరవేర్చువాఁడ.

ద్రౌప—ప్రాణేశ్వరా! నాకోర్కెల సఫలముసేయ మీరకాక మఱి వ్వరుగలరు? కాని,

చ॥ అవనిపతీంద్ర! కోరు మని ♦ యంట కడుఁ సులభంబు, దానిఁ దీ
ర్పవలసి వచ్చినంత నది ♦ పాయని సంకటమై యొసంగెడిఁ;
యువతుల కోర్కెలఁ దనుప ♦ నోపును బ్రహ్మకునైనఁగాని, యీ
పవనతనూజ! యట్టియెడఁ ♦ బల్కఁగ నేల మనుష్యమాత్రులఁ.

మఱియు,

గీ॥ భీరువైనను నగనము ♦ ధీరుఁడైన
సారసాక్షుల చెంగట ♦ బీరములను
దఱచుఁ బల్కును తన్నుఁ దా ♦ నెఱుఁగకుండఁ
గదిసిరా మీఁదఁ జెందును ♦ గళవళంబు.

భీము—(కోపముతో) ఏమి! అట్టులనా!—

ద్రౌప—నాథా! అనివార్యశౌర్యధుర్యుల రగు మిమ్మనుటకాదు. పుడమిఁగల సామాన్యపురుషుల నడవడిఁ దెల్పితిని. కావున మీరు వేఱుగఁ దలంపక నన్ను మన్నింపవలయు.—

భీము—ఆహా! పాంచాలీ! ఏమంటి వేమంటివి? అట్లైన నాప్రతిన వినుము.

చ॥ వనజభవుండు తా నెదిరి ♦ వచ్చినగాక, పురాంతకుండు పో
రొనరుప నిల్చెఁగాక, వనజోదరుఁ డెచ్చుగ నిచ్చమెచ్చరం
బున ననిసేయుఁగాక కడు ♦ ముచ్చట నీదగుకోర్కె దీర్పకుం
డిన శమనాత్మజానుజుఁడ♦నే, పవమానసుతుండనాదునే?

కావున నింకనైన నీసందియం బుడిగి యుండుము.

ద్రౌప—(విన్నంబోవుచు) కట్టా! జీవితేశ్వరా! చంద్రవంశాబ్ధిచంద్రా! రణరంగభీమ! మతిలేక నే ననిన మాటకై యిట్టి కెట్టిదంపు ప్రతినఁ బూనుట న్యాయమా?

చ॥ అనిలతనూజ! యీ వనవిహారము చాలును; కోర్కెఁ దీర్పఁడీ
యని మిము వేడికొంట మొద ♦ లంటనె చాలును; దానిఁ దీర్పఁగాఁ
జనుటయుఁ జాలు; నింక నిట ♦ జాలును నిల్వఁగ; వచ్చినట్టి త్రో
వను గనఁ జాలుఁ; జాలునిక ♦ వందలు వేలును దెచ్చియిచ్చుటల్.

భీము—(చిఱునగవుతో) పాంచాలరాజనందనీ! యేల నీవిట్లు కలవర పడియెదు?

గీ॥ నాదు తెగువయు ధైర్యము ♦ నాదుశౌర్య
మీ వెఱింగియు నిట్టుల ♦ నెంచ నగునె?
కోరు మెయ్యదియేని నీ ♦ కోర్కెఁ దీర్తు
నిల నసాధ్యంబు గలదె నా ♦ కెద్దియైన?

మఱియు,

క॥ ఇచ్చెద నని యీయనిచో
హెచ్చగుపాతకము; పుడమి ♦ నెగ్గగు; శూరుల్
చొచ్చెదు త్రోవయుఁ గా దది;
చెచ్చెర నీయిచ్చఁ దెలియఁ ♦ జెప్పుమి యబలా!

ఆవంతయు సంశయింపక తత్క్షణ మడుగుము.

ద్రౌప—నాథా! నాకోర్కెలఁ దీర్ప మీరకాక మఱెవ్వరు గలరు? మొట్టమొదట నేను మీవెంట వచ్చుటయే నాకు సకలసౌభాగ్యంబు

లబ్ధిన ట్లయ్యె. మరియు మీ రిప్పుడు కోరుమనియున వలెననుట
సిరిరా మోకాలడ్డిన చందంబుగదా! కాని యీకానన నిప్పుడిక్కడఁ
గోరఁదగినవస్తు వే మున్నయది? ఈవనమార్గంబున నాయెదఁదగులు
వస్తు వెద్దియేని నొకదానిఁ గాంచి చెప్పుదుగదా నావేఁడికోలు.
కావున మన మీవనమునం దింకను గనులపండువు సేయఁగల నద
ములను నగములను గొలఁకులను వాహినులనుంగల ప్రాంతముల
కేగి యందందుఁగల చోద్యములఁ గనుఁగొందము.

భీము——మంచిది. అట్టులనే పోవుదము నడువుము. (ఇరువురు కొంత నడచి) సరసీరుహాననా! ఈసరోవరముఁ గనుంగొనుము.

సీ॥ పంకజాతమరంద • పాన లోలాళినీ
గానమాధుర్యంబు • గాంచు మబల
జలజపత్రములపై • నిలిచి యుయ్యెలలూగు
కలహంస పింఛులఁ • గాంచు మబల
నళినపరాగసం • కలనఁ జంద్రికసాంద్ర
కాంతు లీనుదిలంబు • గాంచు మబల
ప్రతిబింబముల నిచ్చు • ప్రవిమలతర చంద్ర
కాంతసోపానముల్ • గాంచు మబల
తీరభూభాగసంస్థిత • భూరుహముల
నించు సుమసంతతులసొంపు • గాంచు మబల
కమఠమకరాది జలజంతు • కాండములను
గాంచుమీ! యిట్టిసరసులఁ • గాంచ మబల.

ఆకన్పట్టునది చూచితివా?

చ॥ హృదయము నిర్మలామృతము • నీక్షణముల్ జలజాతపత్రముల్
ముద మిడు హంసయానములు • పొల్పగు హాసము ఫేనమొప్పు మే
నే దనరు పుష్పవాసనల • నాథుని సాగరుఁ గూడు వాంఛమై
[illegible] నదీలలామ కడు • సొంపు జనింపఁగ నేగుదెం[illegible].

ఇంకొక దెస చూతము రమ్ము. (ముందునకు వచ్చి) చూచితివా!

గీ॥ ఇందు గరుడులు, కిన్నరు • లిందు, యక్షు
లిందు, గంధర్వు లుందు రిం • దిందు సిద్ధు,
లిందు సాధ్యులు, తపసు లిం•పొంద నిందు
నుందు, రయ్యావె వారల • మందిరములు.

ద్రౌప—ఆహా! బాగుబాగు! సరియుకాని, (ఒకదెస చూచి)

చ॥ అవనిపతీంద్ర! ఆకసము • నంటుచు వృక్షలతావితానముల్
నవవిధగుల్మసంతతులు • నల్గడలం బొలుపొంద నేత్రవై
భవముగ నున్న యీనగము • వర్ధిలు నెట్టి పవిత్రనామ మీ
భువిఁ గని దానిఁ దెల్పి మది•ముచ్చట దీర్పఁగ మిమ్ము వేఁడెదన్.

భీము—వనజాయతాక్షీ! అదియా!

గీ॥ దానిఁ బిలుతురు గంధమా•దన మనంగ
వర్ణనాతీతమై యది • వఱలు జగతిఁ
జలిమలయు మందరాద్రియు • స్వర్ణగిరియుఁ
బోల; నది యెల్లమహిమల • పుట్టినిల్లు.

మఱియు,

గీ॥ భాగ్యభోగ్యంబులకు నెల్లఁ • బట్టుకొమ్మ
పొదలు నోషధివితతికిఁ • బుట్టినిల్లు
గరుడ సురసిద్ధ యక్ష కిం • పురుషమానవ
కోటికి భూధరేంద్రంబ • యాటపట్టు.

కావున దానిఁ జూడఁగోరుదువేనిఁ బోదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమించి వేఱొకపక్క ప్రవేశింతురు.)

భీము—జలజాక్షీ! ఈనగమునం గల వినోదంబులఁ గనుఁగొనుచుచున చాలదవ్వు వచ్చితిమి! ఏమి మహ యదివేళము! మననివాస మిక్క డికి కొన్ని యోజనము లుండఁ గలదు.

గీ॥ కాంత! భానుండు నడుమనుంటఁ • గలఁడు కనుమ
ఈ నగవినోదసముదయ • మెల్లఁజూడ
నేత్రములు వేయిగల్గిన • గోత్రవైరి
కైన సాధ్యంబుగా దది • యగునె మనకు?

కావున నీనగవినోదావలోకనమిషచే మన మింక నిక్కడ నొక్కింతతడ వుంటిమేని మనయిర్వురిపైఁగల ప్రేమాతిశయంబున నన్నగారు మనరాకకై యెంతయో తహతహ పడుచుండుగదా! ఇంక మనము సత్వరము పోదము రమ్ము.

ద్రౌప—నాథా!

సీ॥ కరుణాలవాల! మీ • కతన నీనగముపైఁ
గల చోద్యములఁ గనఁ • గలిగె నేఁడు
మీపుణ్యవశమున • నీపుష్పవితతి సు
గంధ మాఘ్రాణింపఁ • గలిగె నేఁడు
పొలుపొందు మీదయఁ • గలకంఠశుకముఖ్య
కలరావముల వినఁ • గలిగె నేఁడు
వరలు మీసంగతిఁ • బరిపక్వ మధురస
ఫలవితానముఁ దిన • గలిగె నేఁడు
మీకృపాదృష్టి నాపయి • సోకియుంట
గంధమాదన సౌందర్య • గరిమఁ గనెడి
భాగ్య మబ్బంగనయ్యె నో • భవ్యచరిత!
యెంతచూచిన సంతృప్తి • యొసఁగదయ్యె.

భీమ—నిశ్చయమే. కాని కాలాతీతమయ్యె. పోవుదము రమ్ము. (అని ముందునకుఁ జనుచుండఁగా సౌగంధికపుష్ప మొకటి యిరువురి మధ్యను పడును. ఆపుష్పమును ద్రౌపది చేత నెత్తి)

ద్రౌప—(తనలో) ఆహా! చూడఁగా నిది దివ్యసుమంబని తోఁచెడిని. కానిచో నిట్టిగొనము లీవనమునఁ గలిగెడునా? ఏమి యీసుమసౌరు

మార్యము! (ప్రకాశముగా) నాథా! యీపస్రూనమును జూడుఁడు.
దీసిచక్కఁదన మనిర్వచనీయంబుగదా!

ఉ॥ కాంతిని బాలభానుప్రభఁ◆గా దనిపించెడు; సౌరభంబునన్
సుంతయు నీడు గానము వ◆సుంధరయందునఁ; జూడఁ జూడఁగా
వింతగఁ దోఁచుచున్నది న◆వీనముగా, నిది భర్మనిర్మితం
బంతయునొచుఁ దావిగను◆టబ్బుర మయ్యెఁగదా మనోహరా!

భీమః—(ఆశ్చర్యముతో) పాంచాలీ! నీ కీపుష్పం బెందుండి వచ్చె? మన మిర్వురము జంటగనే చనుచుంటిమిగదా! నే నెఱుంగకుండ నీకెట్లు వచ్చె?

ద్రౌప—నాథా! ఎట్టు లననేల? మన మిర్వురము వనవిహారోత్సుకత నేతెంచితి మని యెఱింగి మామామయగు గాడుపుతేఁడు,

క॥ చూడఁగఁ జనుదెంచుచుఁ దన
కోడలి కేదేని కాన్క ◆ నొసవలె నని, పూఁ
బోఁడుల కిష్టంబగు నీ
పైఁడి ననన్ దెచ్చియిచ్చెఁ ◆ బవనతనూజా!

భీమః—ఏమీ! వాయుభట్టారకుండు దీని నొసంగెనా? సంతోషము—పోవుదము రమ్ము.

ద్రౌప—ఇచ్చెఁ గాని,

గీ॥ నరవరా! పాటకాబ్జంబు ◆ నరయ మదినిఁ
గోర్కెలిగురొత్తె, నివ్విరి ◆ నొందునంచుఁ
దలఁప మున్నెవ్వరో దీనిఁ ◆ దల ధరించి
నట్టుగనృట్టు దీని నేఁ ◆ బెట్టుకొట్టు?

విరులపై విరిబోండ్ల కమితప్రీతి, కాని యొకరిచే ధరింపఁబడిన ప్రసూనము లింకొకరు దాల్ప యోగ్యములు కావుగదా! కావున,

ఉ॥ ఇంతకు మున్ను నన్నుఁగని ◆ యింతిరో! నీమదిఁగల్గు కోర్కెల
త్యంతముదంబునన్ దెలుపు ◆ మయ్యవి పైశమ తీర్తునంచు మీా

కొంతయుఁ బల్కియుంటివి; రిపు ♦ దీకనకాంబుజములఁ గనుఁగొనఁగ
సంతసమయ్యె; నిట్టి సుమ ♦ సంతతులఁ గొనితేరఁ గోరెదఁ.

గీ॥ ఇట్టి కనకాంబుజంబు లే ♦ యెయ్యెడను గలవొ
యరసి, కొన్నిటిఁ గొనివచ్చి ♦ కరుణతోడ
నొసఁగి, నాముద్దు చెల్లింపుఁ ♦ డో శుభాంగ!
ఆడి తప్పరుగద పూజ్యు ♦ లవనియందు.

మీరలీవరముం బ్రసాదింపకున్న మీపాదములాన నేనిచ్చోటు విడుచుదానఁగాను.

భీము—(ఆశ్చర్యమును జింతయుఁదోఁపఁ దనలో) ఇప్పు డిట్టిపుష్పంబు లెక్కడనుండి తేఁగలను? వాగ్దత్త మొసంగితినని కూడ సూచించుచుండెనే? ఈకులుకులాడి పలుకులు నాచెవులకు ములుకులంబోలె నాటఁదొడంగె—అన్నా! పాండవాగ్రణీ!

గీ॥ "వలదు తమ్ముఁడ! భీమన్న ♦ వలదు వలదు
మెలఁతతో నొంటి వనికేగ ♦ వల" దటంచుఁ
బెక్కురీతుల నాతోడఁ ♦ బ్రేమగదుర
దెలిపియుంటివి విననైతిఁ; ♦ దెలిసె నిపుడు.

ఎన్నియో తెఱంగుల వలదని వారించినను జడుఁడనై పట్టువదలక యీద్రుపదాత్మజను నేనిట్టి వనమునకేల వెంటఁబెట్టుకొని వచ్చితిని? వచ్చితినిపో, నీ వెద్దికోరిన నిత్తునని ముందుగ నేల ప్రతినఁ దాల్చితిని!—ఛీ! మందమతీ! పెద్దలసుద్దులఁ జెడచెవినిడిన దోసకారివి. నీవేల యీలమటల ననుభవింపక పోదువు?—

ఐనను నిది సమయముకాదని చెప్పి చూచెదఁగాక. (ప్రకాశముగ) కాంతా! సుమంబులఁ దెచ్చుట కిదియా తరుణము?

క॥ వనజాయతాక్షి! కనుమీ
వనజాప్తుఁడు పశ్చిమాద్రిఁ ♦ బరిశేష్టింపన్

జనుచుండెఁ గనుము, దనుజులు
వనచరులుగా సంచరింప ♦ వచ్చెద రిటకుఁగా.

కావున మన మిప్పుడే చనకుంటిమేని మన కెట్టిబెట్టిదంపుముప్పు వాటిల్లునో యెఱుంగరాదు.

గీ॥ అనువుగానట్టి సమయంబు ♦ లందు స్వల్ప
కార్యమైనను నెఱవేర్పఁ ♦ గానగు నొకో?
భోజనప్రియుఁడైనఁ దా ♦ బొజ్జనిండఁ
దిన్నతఱి నొక్కకడియైనఁ ♦ దినఁగలండె?

తరుణీ! తరుణముగానితఱిఁ గోరిన నే నేమనఁగలను? పుష్పంబుల కేగెదనన్న,

గీ॥ కాననాంతరముల నొంటి♦గా లతాంగి!
యెటుల నిన్విడనాడి నే ♦ నేగువాఁడఁ
బ్రాణపర్యంత మైనట్టి ♦ పనులనైన
మానహానికి నోర్వరు ♦ మానధనులు.

కావున,

ఉ॥ అన్నులమిన్న! కొన్నినల ♦ కై యట కేగెద నన్న నొంటిమై
నిన్నిట నిల్పఁగావలయు ♦ నే నిట నిల్చెదనన్న నెవ్వ రా
కొన్నన లిందుఁ దెత్తు రట♦కుఁగా జన నెంచుట కిందునుంట కే
నన్నఁడెఱుంగ నైతిఁ గద ♦ యీయెడఁదాల్పఁగ విశ్వరూపముఁగా.

కావున నిప్పుడు మాయన్నయున్న యెడకరిగి నిన్నటడించియీవేళవం జని సౌగంధికంబులఁ దేకున్న నీవు నామోముఁ జూడకుము. ఇది యెంతటిపని! ఇట్టి స్వల్పకార్యమునకై యిట్టులమార్గఖిలీముఁబూనుట పాడిగాదు. జాగుసేయక పోవుదము రమ్ము.

ద్రౌప—నాథా!

గీ॥ బలపరాక్రమ సంపద ♦ వెలసినట్టి
ధీరవరు నిన్ను నావంటి ♦ తెఱవ కోర

భీరునింబలె నీరీతి ♦ భీతిఁ జెంది
పల్కుచుండుట చిత్రమా ♦ బవనతనయ!

నే వల దన్నను బట్టుదలక,

గీ॥ కోరు మెద్దేని, దానిఁ జే ♦ కూర్తు నిక్కు
కూర్పనున్న యుధిష్ఠిరు ♦ కూర్మిసోద
రుండ నేఁగాను పాంచాల్య ♦ జుండఁగా న
టంచుఁ బల్కిన మాట లేమయ్యెనొక్కొ?

నే నింతగ మిమ్ము నరికట్టుటకు,

గీ॥ పాండవాగ్రజు లుండెడి ♦ వనికి నేగి
"అన్న! కనకాంబుజంబు లీ ♦ యుతివ కోరెఁ
దెత్తు" నన వలదనక తాఁ ♦ దేఁబనుచు నె?
చూడనిది కొనసాగని ♦ జాడ కాదె?

ఆకారణమున మిమ్మింతగఁ గోరుచుంటి. ఐనను ప్రేమాతిరేకంబున వెనుకముందు లారయక యిచ్చవచ్చినటుల విచ్చలవిడిగఁ బల్కువేళలు వేరు, ఈ వేళలు వేరు. (అని చింతతోఁ దలవంచుకొనును.)

భీము—పూఁబోఁడీ! నీ పీతిరున నాడఁ జెల్లునా? ఈఘోరాటవీమధ్యంబున నిన్నొంటిగ నిల్పి చన నిక్కముగ నే నపకీర్తిపాలగుదును. లేక నిను వెంటఁగొనిపోవుదు నేనియటతప్పకముప్పు వాటిల్లును. ముందుకుఁ బోయిన నూయియు, వెనుకకుఁ బోయిన గోయియు, నయ్యెగదా! నీవొక్కింతయైన యోజింపవేమి? నీయట్టిసాధ్వి యిట్టి యవివేకబుద్ధిఁ దలంచుట కేవలము దైవయోగమని తోఁచెడిని. ఇంచుకేనియు నీపట్టినపట్టు వీడకుంటివి. ముందేమికానున్నదో కదా!

ద్రౌప—నాథా! మిక్కటమగు నాపఁ జిక్కించి చిక్కింపకుఁడు.

భీము—(విచ్ఛవడుచు తనలో) అహా!

ఉ॥ పట్టినపట్టు నీడు(?)పదు • పట్టి యిుకఁ విడనాడఁబోవ; నీ
పట్టునఁ గార్యసాధనవు • ఫక్కిఁగనుంగొన దుర్ఘటంబు; కా
మెట్టి విపత్పరంపరల • నీమొడఁజిక్కితిఁ; జేసినంత దా
చట్టులో ధాత్రిపై ననుభవింపకతీరున మెట్టివానికిఁ?

ఈ తెలివ యభీప్సితం బీడేర్చెదనని నే నొక్కరుండనగుట,

గీ॥ కాంతకడఁ గావలిగ నుండ • గల్గునెవఁడు
దివ్యకుసుమంబు లిచటికిఁ • దెచ్చునెవఁడు
కాంచనాబ్జంబు లెయ్యెడఁ • గలవొ వాని
జాడలం జెప్పఁజాలెడి • జనుఁ డెవండు?

దైవమా! యేలయిలాతీరునఁ బరీక్షించెదవు? అగ్నిజా! నీ మాట విననిదోస మిప్పు డనుభవించుచుంటిని. (అని చింతతో నేలఁజూచుచుండ నొకదెసనుండి నారదుఁడు ప్రవేశించును.)

నార—(తనలో) ఆహా! బ్రహ్మమానసపుత్త్రుండనయ్యుఁ బ్రియం బగు నాహారంబులేక యెన్నియో దినంబులనుండి నిత్యైకాదశీ వ్రతంబు సల్పుచుంటిఁగదా! ఎందరిగిన నందుఁగల యెల్లవారును “రా, రండి” యని మర్యాదగఁబిల్చి యెవ్వియో నొక్కట్టములేని షడ్రసోపేతంబులగు నాహారంబు లొసంగుదురు. కాని వానిపై నాకెంతమాత్రము నిష్టముండదు. కలహభోజనుండ నని పేరువడి యుంట నట్టిభోజన మెన్నండు దొఱకునాయని నామనం బువ్విళ్ళూరుచుండు. దానికై మనోభీష్టదాయకంబగు హరినామస్మరణంబుఁ జేయుచు నుండేని నరిగెదఁగాక.

తోడిరాగము—రూపకతాళము.

దీనావనశీలా–ర–మానారీ హృదయఖేల
గానలోల, కనకచేల, కరిరాణ్ముఖ భక్తపాల ॥దీనా॥
కారుణ్యామృతపూరా–శ్రీ–కౌస్తుభ మణిమయహారా
మేరుధీర–దురితదూర–బింబాధరాంతస్థలవిహార ॥దీనా॥

(అని పాడుచు ముందునకువచ్చి)

ఇం దెవ్వరోయున్నట్లు లగుపట్టుచున్నయది. పోయి వా రెవ్వరై యుందురో కనుఁగొనెదఁగాక! (భీమునివైపున కరుగుచుండ)

భీము—ఈ ఘోరాటవీమధ్యంబునఁ దారకనామపఠనంబు వినవచ్చుచున్నయది. వా రెవ్వరై యుందురు? (దిక్కులు పరికించి నారదుఁ గాంచి యెదురేగి) బ్రహ్మమానసపుత్త్రా! నమస్కారము.

నార—కల్యాణము!

ద్రౌప—త్రిలోకపూజ్యా! నమస్కారము.

నార—దీర్ఘసుమంగలీభవ! దీర్ఘాయురస్తు! మనోవాంఛా ఫలసిద్ధిరస్తు! (స్వగతము) ఇప్పుడు నాకుఁ గొన్ని శుభశకునంబులు కనిపించుచున్నయవి. వానింబట్టిచూడ మన్మనోభీష్టసిద్ధి యచిరకాలంబునఁ గలిగెడునని తోఁచెడిని. (ప్రకాశముగ) భీమసేనా! కాంతాసమేతుండవై కాంతారములకేతెంచి యిందలి వింతలఁగాంచి యత్యంత సంతోషంబు గల్గియుండుటకు మారుగ నీవదనాబ్జంబు శోభదరిగి యుండుటకుఁ గతంబేమి?

భీము—మౌనిచంద్రా! యేమనిపలుకువాఁడ!

ఉ॥ మౌనికులావతంస! విను ♦ మానినిఁగూడి విహారవాంఛ నీ
కానకువచ్చి యీరుచిర ♦ గాత్రికి నొక్క వరం బొసంగితిన్;

నార—శౌర్యధనుండవగు నీ వీకురంగనయనకు వరంబొసంగుట యుచితమేకదా! తరువాత?

భీము—దానికి నిప్పు డీముగుద ♦ తప్పక తెమ్మనె నిట్టి సూనముల్;

నార—నీవంటివాఁడు వరముం బ్రసాదింప నిదియా యీ ముదిత కోరుట! తరువాత?

భీము—కాని, తదీయపుష్పతతి ♦ గల్గినచోటు తెలియంగ నివ్వెడన్.

ఈపుష్పంబు లున్నతెన్ను లరసెదనన్న నొక్కగుండనగుట నబల కడ నుండుటకును కమలంబుల కేగుటకును వీలు పడదయ్యె. ఎవ్వరైన నొక్క రియ్యెడనున్న శీఘ్రము నావిరులం దేఁజాలుదు.

కావున నోత్రిలోకవంద్యా! కుసుమంబులఁ దెచ్చి యీకుసుమ కోమలి నొనంగి సంతోషపెట్టుట కెద్దియేని యుపాయంబొండు ప్రసాదించి నన్ను ధన్యుంజేయ వేఁడెద.

నార—(చిరునగవుతో) అట్లులనా? వృకోదరా! నీకసాధ్యమగు కార్య ముండునా? ఈ వనజాక్షి చెంతనుండుటకుఁ దగినవాని నొక్కని నరయలేకుంటివా? లేఁడా నీకుమారుండగు ఘటోత్కచుండు? నీకాతం డిప్పట్టున నెక్కుడు సాయపడఁగలఁడు. వానిరప్పించి యిచ్చోనిలిపి, నీవ చని కనకకుసుమంబులం దెమ్ము. సకలలోకప్రఖ్యాతిశౌర్యశాలివగు నీ కీకనకప్రసూనంబులఁ దెచ్చుటన నెంత? ఈ పుణ్యశాలిని యగు పాంచాలీమనోభీష్టం బీడేర్పకుంటివేని దుఃఖితయగు. అది నీకు నశుభాగమన హేతువు కానోవు. కావున వానిందెచ్చి యీమచ్చెకంటిముచ్చటం దీర్చుము. నీవేగెడి మార్గంబున నీకుందగినవాఁ డొక్కరుం డగుపడి యీ కనకప్రసూనంబు లున్న తెన్నుఁ దెల్పఁగలండు. అనుమానంబుమాని వేగ చనుము. నేను పోయివచ్చెద.

భీము—చిత్తము. (నమస్కరించును.)

నార—(నిష్క్రమించును.)

భీము—(ద్రౌపది నుద్దేశించి ససంభ్రమముగ) పాంచాలరాజనందనీ! నీ మనంబునం దించుకంతయు సంకోచింపకుము. ఇప్పుడే హైడింబుని రప్పించి యిటనిలిపి నేనచని ప్రసూనంబులఁ దెచ్చెద. కావునఁ జింతంబొసి సంతోషముగ నుండుము.

ద్రౌప—నాథా! మీ చెట్టఁబట్టిన నాకెట్టిచింతయు లేదు. అట్లలనే కానిండు.

భీము—(కన్నులుమూసికొని) దేవానీకభయంకరాకారమూర్తీ! సముదగ్రశత్రుసంచయసమవర్తీ! ఘనబలోద్దండ విక్రమస్ఫూర్తీ! ఘటోత్కచనామ నిశాచరచక్రవర్తీ!

# భీమ ప్రతిజ్ఞ

(తెరలో గంభీరారావములతో ఘటోత్కచుఁడు ప్రవేశించును)

ఘటో—(ద్రౌపదీ భీములంజూచి వినయంబున) నమస్కరించుచున్నాఁడ. తండ్రీ!

ఉ॥ ఎందుల కీరు నన్ను మది ♦ నెంచితిరో తమ కెట్టికార్య మీ
నందనునుండి కావలెనొ ♦ నవ్యసుధామధురోక్తిఁ దెల్పుఁడీ;
కొండలమీఁద భూపతులఁ ♦ గొట్టుదుఁ బట్టుదు ఘాతకోటులన్
జెండఱవందలౌనటులఁ ♦ జెండుదు మొండుగ దైత్యమండలిన్.

మఱియు,

సీ॥ ఈరేడుభువనంబు ♦ లెల్ల దల్లడమందఁ
జేయఁజాలుదు నట్లు ♦ సేయుమన్న
కులగిరులెల్ల న ♦ ల్లలనాడునట్టులఁ
జేయఁజాలుదు నట్లు ♦ సేయుమన్న
గరుడ గంధర్వ కిన్నరుల గర్వాసులఁ
జేయఁజాలుదు నట్లు ♦ సేయుమన్న
జలనిధులెల్లను ♦ గలక జెందెడురీతిఁ
జేయఁజాలుదు నట్లు ♦ సేయుమన్న

తే॥గీ నష్ట దిక్పాలకుల భవ ♦ దంఘ్రిపద్మ
ములను భయభక్తిఁ గేల్మోడ్చి ♦ నిలుచు నటులఁ
జేయఁజాలుదు మీరట్లు ♦ సేయుమన్న;
జనక! వేవేగ మీయాన ♦ వినఁగవలతు.

భీము—కుమారా! వీరశేఖరా! నిన్నుఁ బిల్చిన కారణముఁ దెల్పెద వినుము.

గీ॥ వనవిహారంబుఁ జేయుచు ♦ వచ్చువేళ
వనజలోచన కోసఁగితి ♦ వర మొకండు
దాని కిష్టపడఁగోరె ని ♦ ద్దానిఁ బోలు (అనిచూపుచు)
జలజములు కొన్ని తెమ్మంచు ♦ జలజవదన.

ఆడినమాట తప్పుట పాడిగాదు. కావున నిట్టి ప్రసూనంబులం దెచ్చి యిచ్చి యీపాంచాలి కోరికం దీర్పవలయు.

ఘటో—జనకా! ఇదియేనా నేఁ జేయవలసిన చెద్దపని? పెలవయ్యే నేనిఁ దృటికాలంబునం దెచ్చి తమ కర్పించువాఁడ.

భీమ—తండ్రీ! నీ ధైర్యస్థైర్యంబు లేనెఱుంగనివి కావు. నీయందట్టి సామర్థ్యము కలదు. కాని యీయన్నులమిన్న నన్నుఁ దెమ్మనికోరె. కావున నేన పోయి యావిరులం దెచ్చువాఁడ. అంతవట్టు నీవు నీ తల్లిం గాపాడుచుండుము.

ఘటో—తండ్రీ! మీయాజ్ఞ శిరసావహించెద.

భీమ—పాంచాలీ! నీ కోరిన విరులిదే తెచ్చువాఁడ. నే వచ్చుదనుక నీసుతుండగు ఘటోత్కచుండు నిన్నుఁ గాపాడుచుండు. కావున నిర్భీతిగ నీ విం దుండుము. (అని మేను బుజుకను)

ద్రౌప—నాథా! చిత్తము. ఆలాగుననే పోయిరండు.

(భీముఁడు నిష్క్రమించును. తెరవనికజారును.)

---

రంగము—అరణ్యప్రదేశము.

(ప్రవేశము—ఒకపొదరింట నిద్రించు ద్రౌపదియు, దానిముందు భాగమున ఘటోత్కచుండును)

ఘటో—వన్యమృగయూథ భీషణ ఘోషణంబులు మిటిమీఱుచున్న యవి. ఈయమ కవి నిద్రాభంగముఁ గలిగించునేమో కదా?

ద్రౌప—(తుళ్ళిపాటున లేచి) ఏమీ యీపాదుకలు! మనము కలంచుచున్నయది. అయ్యో! నాప్రాణవిభుండు వలదని చాటిచెప్పినను వివనైతి. హా! నాథుండు కానసంబున కేగి తడవయ్యె. ఇంకను రాఁడయ్యె. ఈ నాస్వప్నఫల మెటులఁ బరిణమించునోగదా!

చ॥ వనమున కేల వచ్చితివి? ♦ వచ్చితిఁబో, కనక ప్రసూన మీ
కనులకు నేల కన్పడితొ? ♦ గన్పడెఁబో, తమి దేల కల్గె నా

మ్మనమునఁ? గల్గెఁబో యల సు♦మమ్ములఁ దెమ్మన నేల నాథుఁ? డె
మ్మని వచియింతుఁబో, విభుఁడు ♦ నొందని నన్విడి యేగ నేలకో.

నాథా! నామాట త్రోసివేయఁజాలక యొంటిగ విపినంబుల కరిగితివా?

గీ॥ అడవి నాప్రసూనమ్ము లే ♦ వెదను గలవొ
అరయఁగల్గితొ లేదొ భూ♦వర! మరేమి
కార్య మయ్యెనొ? తెలియంగ ♦ గలమె? నిజము
సుమ్ము "స్త్రీబుద్ధి ప్రళయాంత ♦ క"మ్మనంగ.

విభుని విపినంబుల కంపి యెంత దురంతచింత నొందుచుంటి. (పుష్పము నుద్దేశించి) కనకప్రసూనమా! నీమూలమునఁగద నాకిన్ని కడగండ్లు సంప్రాప్తించె.

ఉ॥ కోమలరూపముల్ బయినిఁ ♦ గోరికలూరెడి వన్నెచిన్నెలన్
హేమకురంగ మారఘుకు♦లేశ్వరు మైథిలిఁ బాపినట్టు లీ
కోమలరూపముల్ బయినిఁ ♦ గోరికలూరెడి వన్నెచిన్నెలన్
హేమసుమంబ! నాథు నను ♦ ని ట్లెడఁబాయఁగఁ జేసి తక్కటా!

నీవు నాకై యెందుండి వచ్చితివి? ఇది మాయయా, లేక నాఁడు సీతారాముల నెడఁబాపిన కురంగమే యిద్యెడ మా యీ జాయాపతుల నెడఁబాప నీపుష్పరూపంబున నవతరించెనా?-అయ్యో! యెంతటిపాపిని! ఇచ్చటి తెఱంగెఱింగిన నాయుధిష్ఠిరమహారాజు నాపై నలుకఁబూనకుండునా? నను నిందింపకుండునా? ఆహా!—

ఘటో—అమ్మా! ఏల నీవీలీల విలపించెదు? నిర్వ్యాక్రవరాక్రముండగు మజ్జనకుం డనపాయుండై యిందు సత్వరమ రాఁగలండు. భయం పడవలదు. ఆ వీరశేఖరు నెవ్వారును మీఱఁగల్గుదురా? అటుగాక మరొక్కటియైనచో,

చ॥ పరమపతివ్రతామణీ! జ♦వం బను సంపద బెంపు గన్న నా
పరిపోషకుండు గల్గఁ దమ♦సాటిసతీమణికిన్ గొఱంతయే?

నరసుర నాగలోకముల ♦ నాదు శరాహతిఁ బట్టి త్వత్పదాం
బురుహసమీపదేశమునఁ ♦ బొల్పుగ నిల్పఁగ నేర్తు నమ్మరో!

కావున శోకంబు మాని సంతోషంబుగ నుండుము తల్లీ!

ద్రౌప—(గద్గదికతో) అన్నా! అమితబలసంపన్నా!

గీ॥ సాటివిలుకాండ్రలో నెల్ల ♦ మేటి వనియు
నలఘుమాయాప్రవీణత ♦ నమరి తనియు
శూరులం దెల్ల నసహాయ ♦ శూరుఁడ వని
వింటి నే మున్ను దానిఁ గ ♦ న్గొంటి నిపుడు.

చాలుఁ జాలు; నేకాకియై మీజనకుండు వనికిం జన నిర్భీతిగ నీ విట నుంటివి. ఇది ధర్మమా? సమధికశౌర్య సంపన్నుల రగు సమరథికుల నిటఁ గాపువెట్టి నీజనకుని వెంటఁ జనవలదా? అట్లుగాక నీవు

గీ॥ వైరు లెవ్వరులేని యీ ♦ వనమునందుఁ
గోరమీసల మెలివైచి, కొంచు నిలిచి
హెచ్చు పౌరుషవాక్యముల్ ♦ ముచ్చటింప
నేమి కార్యంబు? రాత్రించ ♦ రేంద్రచంద్ర!

అక్కడ మీజనకుండు శత్రులబారిఁబడి నొచ్చినపిమ్మట నీవట కరిగి నీతండ్రియభీప్సితంబు నెఱవేర్చెదవా యేమి? ఏమీ నీ శౌర్య సంపద? హెచ్చుగ మెచ్చవచ్చు!

ఘటో—తల్లీ! ఇట్లు చింతం గుంద నేల?

చ॥ పవనసుతుండు యుద్ధమున ♦ వైరులచేఁబడి నొచ్చియుండినన్
బవలన తారలన్ గనమొ? ♦ భానుశశాంకులు త్రోవఁదప్పరో?
భువనములన్నియున్ బొగులవో? గగనం బది బెగ్గడిల్లదో?
సవితృని వేడివెల్గు లిలఁ ♦ జల్లనయై విలసిల్లఁ జెల్లవో?

అట్టి నాజనకుని సామాన్యమానవునిఁగాఁ దలంచితివా? అమ్మా! అయ్యెడఁ గొంచెక కార్యమయ్యెనని బట్టినగు నన్ను వ్యర్థునిగఁ దలంచితివా! మదీయపరాక్రమం బీ వెఱుంగవైతివి.

ఉ॥ కొట్టుదు నెల్లలోకములు ♦ గుప్పిక్కటబట్టుదు సప్తనీరధుల్
పట్టుదు మూఁడుమూర్తుల నవగ్రహమండలి మండఁ జేయు దీ
పట్టిని, నన్ను, వ్యర్థునిఁగ ♦ భావమునందుఁ దలంచిఁ తల్లి! నీ
విట్టులఁ గుందకమ్మ ధరణీశ్వరుఁ డెత్తు నకుంఠితక్రియన్ ♦

జనని వగుట నీ వీ కరణి ననుఁ గారులాడినను గినుక వహింపఁబోను. ఇయ్యెడ నొకనీతి కలదు. ఏమన,

గీ॥ పితయు, స్వామియునైన యీ ♦ భీమసేనుఁ
డిచటఁ గాపుగ నన్బెట్టె ♦ నెటులఁ జనుదుఁ?
దండ్రియానతి మీఱ నం♦దనున కగునె?
సామివరవుళ్ళ నాయంబు ♦ సమసిపోదె.

మఱియు, శౌర్యసంపన్నుండును మానధనుండును నగు మాజనకునే నూనంబులఁ దెమ్మని వేడితివి. ఆయనయుఁ దానే కొని తెత్తు నని చనియె. అట్టితఱి నేసాయపడంజన నాతండ్రికిఁ బ్రతిజ్ఞాభంగంబు కదా! ఏల నీ వీ లీలఁ బలికెదవు? మజ్జనకుం డిప్పుడే విరులం గొని విచ్చేయం గలండు. కావునఁ జింతం బాసి నెమ్మది వహింపుము, తల్లీ!

ద్రౌప—కుమారా! నీవాడినది నిక్కవమె. కాని నా కిప్పు డనేకాప శకునంబులు గాన్పించుచున్నవి.

గీ॥ మిన్ను తలపైనిఁ బడినట్టు ♦ లున్న దకట,
వామలోచన మదరెడు ♦ వదల కదట,
కనులఁ బాష్పకణంబులు ♦ గ్రమ్ము నకట,
కారణములేని చింత చే♦కూరు నకట.

ఇంతియకాక దుస్స్వప్నంబుఁ గూడఁ గంటి. ఎద్ది యన?

ఉ॥ ఇంతనరాని శౌర్యధనుఁ ♦ డిప్డు నిరాయుధుఁడై శరీరమం
దంతట గాయముల్ గలిగి, యక్కట! రక్తము గార ధైర్య మా
వంతయు లేక దుర్బలుక్రి♦యన్ గడుఁగుందుచు నిల్చినట్లు నా
కాంతునిఁ గాంచితిన్ గలను; ♦ కల్గె భయంబు మనంబునం దొగిన్.

కుమారా! ఈకారణమున నిన్నిట్టులంగునఁ గోరుచుంటి. నీ మాటల నిఁక వినఁజాల, నిముసమైన మనఁజాల.

ఘటో—తల్లీ! ఏల యిత్తెఱంగున భీతిల్లెదు ? వనితలకు వామలోచన మదరిన శుభంబులు చేకూరు. కొత్తగ గాయములు గల్గి నీ విభుండు నిలిచినట్టులఁ గంటివేని నామహనీయుండు సౌగంధికములఁ దెచ్చి యిచ్చినట్లగు. నీ శకునంబులన్నియు మిన్నయైనవి. దానికై నీ విసుమంతయుఁ జింతింపకుము.

గీ॥ అతివ తానంత సంతోషమ్మతిఁ జెలంగఁ
బతికి నంతటి దోశ్శక్తి ♦ ప్రబలుచుండుఁ
గాన మనమున సంతోష ♦ మూను మమ్మ
కమ్రసద్గుణవల్లి! నా ♦ కన్నతల్లి!

మఱియు నందనందనుని కృపావిశేషంబున నాపాండుసూనులు దీర్ఘాయుష్మంతులై యుందురు. తల్లీ!

ద్రౌప—కుమారా! నీ వెటుల నచ్చఁబల్కినను నామదిఁగల దిగులు దీరకున్నయది. ఏమిసేయుదు?

ఘటో—తల్లీ! సద్గుణకల్పవల్లీ! నీ విచ్చో నొంటిగ నున్నకొలంది నీ మదిఁగల దిగు లధికమగుచునే యుండనోపు. అల్లదిగో, కనుఁగొనుము.

శా॥ దేవా! ప్రోవు మటంచు మ్రొక్కిడు నా ♦ దేవాళి రక్షింపఁగా
దేవారాతిసమూహముల్ దునిమి ర♦క్తిన్ రక్తయుక్తంబుగాఁ
బోవం గాంచి త్రిలోకనాథుఁ డపరాం♦భోరాశితూణంబునన్
ద్రోవం జూచెడు చక్రిమట్ల దిననా♦థుం డిప్డు దోఁచున్ దివిన్.

ఇక్కడ నుండఁదగదు. ఇంక నాయుధిష్ఠిరుం డున్నయెడ కరుగుదము. ఆయరద మారోహింపుము తల్లీ!

ద్రౌప—తండ్రీ! అటులనే చేసెదఁగాని యాయజాతశత్రుని సమక్షమున కరిగి యామహనీయువదనారవిందమెట్లు కన్గొందు? హాత విధీ! నా కెట్టి యవమానంబు సంఘటిల్లఁ జేయుచుంటివి!

(ఇరువురు రథము నెక్కి నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

హయగ్రీవాయ నమః

# భీమప్రతిజ్ఞ

---

## తృతీయాంకము

గంధమాదన పర్వతప్రాంతము

(ప్రవేశము - భీముఁడు)

భీము—(ప్రవేశించుచు)

మ॥ పరిపక్వంబగు పండులన్ దినెడి వ్యాపారంబునన్ జేరి వా
నరసంఘంబు స్వభావచాపలము గన్పట్టంగ శాఖల్ నిరం
తరమున్ జేతుల నూప, నొల్లని కపిత్థశ్రేణులన్ దట్టమై
కరమాహ్లాదముఁగూర్చుచుండెఁగద యీకాంతార మెంతేనియున్.

(కొంచెము ముందునకు నడిచి) ఇదే! గంధమాదన పర్వతము.

సీ॥ ఏవీరవర్యుండు గావించె లంక భ్రా
ప్తైశ్వర్యమగునట్టు లలఘు శక్తి
నేవీరవర్యుండు రావణాసురునిచే
స్వర్గమందిన సిగ్గు బాయఁజేసె
నేవీరవర్యుండు భావించె మున్నీటిఁ
బల్వలంబుగ దాట వలసినంత
నేవీరవర్యుండు చేవమై నక్షయుఁ
జించి రావణు దీర్ఘ చింత ముంచె

నేమహావీరునిఁ గల్గి • రాముఁ డెల్ల
లోకముల దుఃఖరహితంబు•లుగ నొనర్చె
నట్టి పూజ్యుండు హనుమానుఁ • డధివసించుఁ
గాదె యీ గిరిరాజంబు•పైఁ దలిర్ప.

వేఱొకవైపును జూచెదఁగాక! (అని నిష్క్రమించును)

(వేఱొక ప్రక్క హనుమంతుఁడు ప్రవేశించును.)

హను—(తనలో)

క॥ తరణికుల చంద్రుఁడౌ రఘు
వరు సుచరిత్రంబు గాన•ఫణితి సతముఁ గి
న్నరతతి పాడ వినుచు మే
న్మఱచితి నే నమృతసింధు • మగ్నుని మాడ్కిన్.

ఆకారణమునఁ జాలకాలము కడచినను తెలిసికొనలేకపోయితిని. (తలచికొని) ఏమి ఆశ్చర్యము! లోకమాత యగు సీతామహాసాధ్వికి నాయం దెట్టి యనుగ్రహ విశేషము కలదు?

చ॥ తనపతియౌ రఘూద్వహుని • ధారుణికిన్ మును పట్టభద్రుగా
నొనరఁగఁ జేయువేళ, ముద•మొంది విభుం డొక తారహారమున్
దనకు నొసంగ, దానిఁగొని • నాయెడఁ గల్గిన ప్రేమ పెంపునన్
వనచరముఖ్య వీరభట•వర్గము చూచుచు నుండ నాకిడెన్.

(కుడికన్నదరుట నభినయించి) సీతాదేవియొక్క యన్వేషణమునందు దక్షిణస్పందనమయ్యె. అప్పు డది శుభాగమన హేతువయ్యె. అదే కన్నిప్పు డదరుచున్నయది. కాని త్వరగా నెందులకీజనుఁ డట్టిమంగళము ననుభవించుటలేదు? (ఒక పెద్దధ్వని నాలకించి)

ఏమి యీ కులభూధరసంక్షోభముఁ గలిగించునట్టి యశనివినిపాతసదృశమగు సింహనాదము!

ఉ॥ నాదములన్నిటిన్ గబళి•నం బొనరింపఁ గురంగగర్భ ని
ర్భేద మొనర్పఁగా, మదక•రేణుమదంబు డుపన్, మృగేంద్రమున్

బాధితనిద్రగా నొనరుపంగ, సమర్థము గన్న దద్దిరా!
యే దెసనుండి వచ్చె నివు • డియ్యది? యెవ్వనిసింహనాదమో?

(దిక్కులు పరికించి) ఏమి కలవరము! ఏమి ఆశ్చర్యము! గొప్పది యగు నీసింహనాదముచే సంక్షోభితవనచరయూథము యొక్క భయచేష్టితము లెట్లున్నవో చూడుము.

సీ॥ భీతిమై నెమళులు • వృక్షశాఖల కెక్క
గమకించి ధరఁబడుఁ • గానకునికి
నం దందె విడివడ్డ • దగు కురంగయుగంబు
బెదరున నొండొంటి • వెదకు నందె
పరుగిడుచుండి యే • వక్త్రంబుఁ దెరచి ప్రే
మనుజూచుఁ బ్రియురాలి • మదవు లేన్గు
నిదురించు హర్యక్ష • మదరిపాటున శిరం
బెత్తి యోజనసేయు • నించుకంత
ఇట్టి విపరీతకార్యంబు • లెవని కార
ణమునఁ గలిగె నీఘోరకా • ననములోన?—
(భీముని దూరమునఁ జూచి)
ఓర! ఇంతటిగఁభీర • మైనమూర్తి
సత్వసంపదఁ గలుగు నీ • జనుఁ డెవండు?

ఉత్సేకముచేతఁ బ్రత్యక్షముగ శరీరముఁ దాల్చి యుద్భవించిన విక్రమమో యనునట్టు లుండె. నాహృదయమునకుఁ జమత్కారము గలిగించునట్టి యింతటి బలాతిశయమును, సమరక్రీడాగోష్ఠియం దధిక పాండిత్యముగల యీగదయు, భ్రూవిక్షేపముచేతనే యతిభారమును వహించిన యీధనుస్సును, గలిగిన యీపూరుషుం డెవండు? మిక్కిలి కఠోరవృత్తి గల యీతనిచేతనే యీవనక్షోభము గలిగిన ట్లె నూహించుచున్నాఁడ. కానిచో నింతటిభయంకరాకార ముగు ప్రకృతి గలుగనేరదు.

(తెరలో)

భీము—ఓగంధమాదనసమీపచరు లగు వనచరులారా!

ఉ॥ తూరుపుదిక్కునంతఁ దన దోఃపటిమంబున గెల్చి కప్పముల్
సారెకుఁగొంచు నే నృపతి సల్పె ధరకా మును రాజసూయ మా
శూరవతంసుఁడౌ శమనసూనుని తమ్ముఁడ! భీముఁడకా! ముదం
బారఁగ హేమకంజములకై యిటు వచ్చితి జాడఁ దెల్పరే?

హను—(విని సంతోషించి) ఆహా! వీఁడు వృకోదరుండు. సకల వీరాగ్రణి. ఉదగ్రబలముచే నిగ్రహింపబడిన బకాసురగర్వసామ్రాజ్యసంపీతుండు. వజ్రతుల్యమైన తన ముష్టిప్రహారములచే రాజసూయాధ్వరమునకు బళుస్వరూపుం డగు మగధనాథుని వధించిన మహావీరుండు. ఈభీముఁడు నాకు దృష్టిగోచర మగుటఁ జిరకాలము నుండి యీగిరిగహ్వరమందుండిన నాయునికి నేఁటికి ఫలప్రదమైనది. (కొంచెమాఁగి)—ఏమిఆశ్చర్యము! మహావీరసంపన్నుఁడు. శ్రమ యన నెఱుంగనివాఁడు. అతనిపాదవిక్షేపముచేఁ బ్రతిపదమునకు శిలలు చూర్ణము లగుచున్న యవి; పిక్కల రాపిడిచే మార్గమునకిరు పార్శ్వములఁగల వృక్షములు భగ్నము లగుచున్నయవి. ఇట్టి యుద్ధామగతిగలవాఁడైనను శరీరమునందు స్వేదకణములు పుట్టుటలేదు; నిట్టూర్పుల సైతము విడుచుటలేదు, ఏమి యీతని యద్భుతగమనక్రియ!—ఇం దాశ్చర్య మే మున్నది? ఇతని పుట్టువునకు వాయుదేవుండుగదా కారణము! మరియు నసమానుమ మగు నేదే నొక పరాక్రమశక్తి లేనిచో మనుష్యసాధారణులకు దుఃప్రవేశ మగు నీవనముఁ జొరుట కితం డెట్లుసమర్థుం డగు? నేను త్వరలో నప్రకాశితస్వరూపుండనై కొండొకకాల మీతనితో వినోదసంపాదనముఁ బొందుట కీతని యాగమనమార్గ మరికట్టెదఁగాక! (అని తోఁకను జెంచి, త్రోవ కడ్డముగ నిడి మార్గమధ్యమందుఁ బరుండియుండును)

భీము—(ప్రవేశించుచు) ఓ గంధమాదనచరు లగు వనచరులారా!

ఉ॥ తూర్పుదిక్కునంతఁ దన ♦ దోఃపటిమంబున గెల్చి కప్పముల్
సారెకుఁగొంచు నే నృపతి ♦ సల్పె ధరణ మును రాజసూయ మా
శూరవతంసుఁడా శమన♦సూనుని తమ్ముఁడ! భీముఁడన్ ముదం
బారఁగ హేమకంజముల♦కై యిటు వచ్చితి జాడఁ దెల్పరే?

(దూరముగ నున్న హనుమంతునిఁ జూచి) ఓరీ శాఖామృగమా! ఎవ్వఁడవు నీవు? మార్గమం దున్నాఁడవు? (తనలో) కదల దేమి!—పాపము! ఈవృద్ధమర్కటము ముదిమిచేఁ గదలనేరక యిట్లు పడియుండ నోవు. వృద్ధత్వం బెట్టివానినైన సంకటముల పాల్సేయును కదా!

సీ॥ అడుగుదమ్ముల కెప్డు ♦ మడుగు లొత్తెడుచాన
దరికిరమ్మని పిల్వఁ ♦ దగవులాడు
అద్దుముద్దుగఁ బెంపఁ ♦ బెద్దయైన సుతుండు
చేర రాఁగోరిన ♦ జీదరవడు
ఆలోచనకు ఘనుం ♦ డని వచ్చు నెచ్చెలుల్
పిలిచిన విన నట్లు ♦ తొలఁగుచుండ్రు
అదియేమిరా యన ♦ నర్భకుల్ సైతము
నీ మాట కా దంచు ♦ నీరసింత్రు

గీ॥ ఏల యింకను జీవించె ♦ నీతఁ డంచు
నీసడించుచుఁ బల్కుదు ♦ రెల్లవారు
కట్ట, వార్ధక్యమా! నిన్నుఁ ♦ గాంచినట్టి
నరుని కడగండ్ల నుడువంగఁ ♦ దరమె ధరణి?

(సమీపించి, బాగుగఁ బరికించి తనలో) ముదిమిగల దయ్యు నతిగంభీరముగ నున్న దే! (ప్రకాశముగ) శాఖామృగమా! ఎవ్వఁడవు నీవు? మార్గ మరికట్టినాఁడవు.

చ॥ ననుఁ గనినంతనే భయము♦నన్ బరతెంచెడు ధీరసత్వముల్
కనుపడుచుండ నీమదినిఁ ♦ గల్గదు భీతి యొకింత యేనియున్

చనవదియేమి! నీసహజ♦చాపలముఁ విడనాడి ధీరతఁ
వనచర! తోవ కడ్డముగ ♦ వాలము చాచుకయుంటి వద్దిరా!

హను—(తనను జూచికొని నవ్వి తనలో) ఆహా! నే నెంతపని చేసితిని! దిగ్దంతిదంతభగ్నసమర్థము లగు భుజపీఠములును, మేరుపర్వతముం డీకొనఁజాలు దృఢతరవక్షస్స్థలమును, త్రిలోకముల దహింపఁగల తేజోరూపమును గల నేను క్షణములో నుపసంహరించుకొని, ధాత్రృపాత్రిథమికావలోకనవిధియం దెట్టి స్వరూపము గలవాఁడనైతిని? —ఔను.

గీ॥ ఇటుల నొనరింపనేని న ♦ న్నితఁడు తెలిసి
కొని, విధేయుఁడై శౌర్యాను♦కూలము లగు
ధీరవచనంబులను బల్క ♦ నేరుచునొకొ?
కాన, నా కిది యొప్పిద♦మౌను గాదె?

భీము—ఏమి ఆశ్చర్యము!

గీ॥ ధాత్రిపై నవలోకన♦మాత్రమున న
వడిఁ బలాయన మగుస్వభా♦వంబు గల్గు
కపికులంబున నిట్టి దె♦క్కడను జూడ
నొర! దీనికిఁ గత మేమొ ♦ యరయరాదు.

ఈభూమియొక్క దివ్యమగు నొకానొక శక్తియె యుండునా?— (విచారించి) కాదు కాదు. ఇతరమృగములయం దిట్టి విలక్షణ మగు శక్తి కనుపించుటలేదు. ఇందునకుఁ గారణమేమై యుండును?

హను—(తనలో) అయ్యో!

సీ॥ విశ్రుతగుణముల ♦ వెలయు తేజోరూప
ముపసంహరించి నే ♦ నుండనేర్తు
శక్తివిహీనమౌ ♦ సర్వావయవములు
గల్గిన దుర్దశ ♦ గాంచనేర్తు
బాష్పపూరంబులు ♦ ప్రవహించు లోచనం
బులతోడ నెట్టులో ♦ మెలఁగనేర్తు

హీనబలుండనై యిటునటుం దిరుగాడ
నెఱుఁగనట్టుల నటియింప నేర్తుఁ
గాని, యనుజుని నధికవిఖ్యాతబలుని
భాగ్యవశమునఁ గాంచుట బాహుయుగము
వేగ నాశ్లేషసుఖమంద వేగిరింప
నార! యించుక వారింప నేరనైతి.

అయ్యో! నాహృదయదర్భ్రమ కాల్పనా?— కాదు కాదు. అటులఁగానిచో అజ్ఞాతపూర్వసంబంధము గల యీభీముఁడు నన్నుఁ గూర్చి యెటులఁబలుకునో తెలిసికొన వీ లుండదు.

భీము—తిర్యగ్జంతువ్రులలోఁ జేరినవాఁడైనను నీతండు నాహృదయము నాకర్షించి నాకు ముం దగుచున్నవాఁడు. ఈతని ధీరత్వంబునుబట్టి సాధారణకపిగాఁ దలఁపరాదు. కొంచెమేనియు భయములేక, విడువక, ప్రతిఘటించుచున్నవాఁడు. పరుగిడఁడు, త్రోవతొలఁగఁడు, నిలుచుండఁడు. ఏమియద్భుతము! మఱియుఁ బ్రతివచనమును బలుకువానివలెఁగూడ నున్నాఁడు. చూపులయందుఁ దిరస్కారము గన్పఱచుచున్నవాఁడు.

హను—(సంరంభముతో భీమునిఁ జూచి) ఓయీ! నీ వెవ్వండవు? ఈవన క్షోభము నీవలనఁ గలిగినదేనా?

భీము—అగును.

హను—ఎందుల కిటుల నాకులపఱచెదవు? వనప్రచార మగు జంతుసమూహమంతయు నెంత భీతి జెందుచున్నదో చూడుము.

భీము—(తనలో) ఏమి యీవానరుని ధార్ష్ట్యము! (ప్రకాశముగ) ఐన నీసంరంభ మేమి?

హను—ఈ యరణ్యములు ఫలద్రుమాదులచే మాకు వృత్తిని గల్పించుచున్నయవి. అందుచే వీనికి నితరులవలన బాధ కలిగినచో మేము పేక్షింపము.

భీము—ఉపేక్షింపక చేయున దేమి?

హను—అట్టులనా? అట్లయిన నీవు నావల్ల నియమింపఁబడఁగలవు.

భీము—ఏమీ! ఈవీరుని వానరుఁడా నియమించువాఁడు?

హను—(నవ్వి) నేను నీతిమార్గముచే నపరాధి వగు నిన్ను వారించుచుంటిని. దాని గుర్తెఱుంగక పరుషముగఁ బలుకుచుంటివి.

భీము—ఏమీ! శూరునివలె యుక్తిప్రయుక్తులచే నాతో సంభాషింప మొదలిడితివా?

హను—ఓయీ! మే మరణ్యసంచారులము. మాకు శౌర్య మెక్కడిది? (నవ్వి) నీవు,

ఉ॥ శూరుఁడవైతివేని ఘన • శూరవతంసులు పెక్కురుందు రీ
ధారుణి; వారిమ్రోల భుజ • దర్పముఁ జూపఁగ నేనుగాక; యో
వీరశిరోమణీ! సహజ • భీరువులై నిరతం బరణ్యసం
చారులు నైన మాకడఁ గ • నంబరుపంగ ఫలంబు గల్గునే?

కానిమ్ము! కడచిన దానికై కలహ మెందులకు? కాని మా దేశమునకు వచ్చిన నీ వతిథిస్వరూపుండవు. కావున నీచేసిన తప్పు నొకసారి సహించితిమి.

భీము—(నవ్వి) ఓహో! మీరు చాల నేర్పరులుగ నున్నారు. మీ పర్యవసానవచనము క్షమారూపముగఁ బరిణమించిన దే!

హను—(తనలో) మంచిది. భరతకులప్రసూతుఁడ వగు నో వత్సా! మృదువచనములతో నేను వచించుచున్నను బ్రకృతిస్వరూప మగు ధైర్యమును విడనాడవైతివి. (ప్రకాశముగా) ఇట్టి వీరత్వము నీ కెక్కడిది?

భీము—ఎక్కడిదా? నేను క్షత్రియుండను.

హను—అయ్యో! నీ పేరేమి? ద్వితీయవర్ణప్రభవుఁడవైనట్లు చెప్పంబని లేదు. మహాభుజములును విశాలవక్షస్స్థలమును గల నీయాకారము వలననే తెలియవచ్చుచున్నది.

భీము—(స్వగతము) ఈ క్రోతి చాల నేర్పరివలె నున్నాఁడు.

హను—ఓ శుభప్రదుఁడా! నీ కులస్వరూపముల గుఱ్ఱెఱుంగుటకు నాకు నుత్సుక మొందుచున్నయది.

భీము—(తనలో) వీనికి నాకులస్వరూపములతో నేమిపని? ఐనను జెప్పిచూచెదఁగాక! (ప్రకాశముగా) అయ్యా! తమ రెఱుంగుదురా పౌరవకుల పారావార పాఁజాతుం డగు నజాతశత్రుం డను మహా రాజును?

హను—(స్వగతము) కొంచెము తెలియునట్లే నటించెదను. (ప్రకాశముగ) అజాతశత్రుం డనువాఁ డెవఁడు?

భీము—(రోషముతో, నవ్వి) ఎఱుంగవా?

గీ॥ మహిని గలఁ డొండు నిఖలరాణ్మకుట రత్న
కిరణ నీరాజితపదుండు, వరగుణుండు
నధిక విఖ్యాత శూరవ రాగ్రజుండు
సత్యనిరతుండు ధర్మజ త్మ్నావరుండు.

ఆ మహానీయుండు నీ కెన్నడును శ్రుతిగోచరము కాలేదా!

హను—(సవినయముగా, నిలుచుండి) ఆఁ తెలిసినది. తెలిసినది. ఆయనయా? ఆయన యిప్పుడు శత్రువులచే నోటువడి, రాజ్య భ్రష్టుఁడై, యరణ్యములయం దధివసించుచున్నాఁ డని వినియు న్నాడను.

భీము—(తనలో) అహా! పాపము శమించుఁగాక! పాపము శమించుఁ గాక! ఆ యా ప్రథితగుణములచే భువియం దెచ్చటనో ప్రభావము మఱుఁగుపడియుండి, కాంతార వాసమే యీతనికి జ్ఞాపకము రావ లెనా? (ప్రకాశముగా) అయ్యా! నిజముగ సంగరరంగమందు శత్రువులచే నోటువడి రాజ్యచ్యుతుఁడైనచో హాలిప్రసాదిత గదాశిక్షాదక్షుం డగు భీమునివలనను, ద్రోణాచార్యద త్తధను ర్విద్యాప్రౌఢిమ గల యర్జుననివలనను, పశ్చిమదక్షిణాంబుధితట

ప్రసిద్ధప్రతాపులగు నకులసహదేవులవలనను బ్రయోజన మేమి? ఈకాంతారవాస మాకారణమువలనఁ గలిగినదికాదే—అగుఁగాక—తెలియఁదగినవారల కది తెలియఁగలదు.

హను—ఈవిషయమునఁ బాండవులయెడ నీ కింత పక్షపాత మెందులకు?

భీము—నా కొక్కనికే కాదు. మహాత్ములపట్ల సత్పురుషు లగువారల కందఱ కుండును. ఈప్రకారముగఁ బ్రశ్నించు నీకే వారియందుఁ బక్షపాత మున్న దని నే నూహించుచున్నవాఁడ.

హను—(స్వగతము) అది నిశ్చయమే. (ప్రకాశముగ) అయిన, వారలలో నీ వొక్కఁడవా యేమి?

భీము—ఈవిషయము దాఁప నేల?

చ॥ అలయిక లేక యేజనుని ♦ హస్తము రాక్షస శిక్షణంబునం
దిలను సమర్థమైన దని ♦ యెల్లరు నాడ హిడింబ వక్షపుం
ఫలకమునం దొనర్చె, మును ♦ ప్రాభవ మొప్ప బలప్రదర్శనం
బల, బలశాలి, భీముఁ డితఁ ♦ డంచు నెఱుంగుము వానరాగ్రణీ!

హను—అయ్యా! నీవు భీముఁడవా? చిన్నతనమున నీ యొనర్చిన వీరోచితములైన విక్రమజృంభితకార్యముల వినుచుంటిమి. అట్టి భీమసేనుఁడవు నీవేనా?

భీము—(నడచుటకుఁ బ్రయత్నించి) ఇప్పటికే కాలహరణ మైనది. మార్గమున కడ్డముగ నీవాలము పొడవుగ నుంచఁబడియె. బలశాలియగు నాంజనేయుండు తొల్లి వారధి నెటుల నతిక్రమించెనో యటుల నే నిప్పుడు లంఘించి చనియెదఁగాక!

హను—(స్వగతము) లోకమునఁ దనశౌర్యమును సరిపోల్చుటయందు నన్ను సాటిగఁ జెప్పుచు నాయందుఁ దనకుఁ గల నిర్మలతర ప్రేమను, గౌరవమును, గనఁబఱచెను. ఇతనితో నింకను సంభాషించి తిరిగి ప్రతివచన మందెదఁగాక. (అని యాలోచనగలవానివలె నవ్వును.)

భీము—నీముఖమునందు నవ్వు కనపడుచున్నది. దాని యభిప్రాయ మునుగూడ వెల్లడిపఱచుము.

హను—ఏమియు లేదు.

భీము—లేదా? ఆకారరూపిత మగునది వచనమందు దాచెద వేల?

హను—అయినఁ జెప్పెద వినుము. (తిరస్కారముగ) హనుమంతుఁ డను నొకానొక క్రోఁతియందు లోకమున కెందుకీ శౌర్యబిరుదాంకిత బహుమానములు. లోకమున దుర్వారబాహుబలసంపన్నులును, త్రిభువనయశోవిశాలురును నగు రామాదులు నీకు శ్రుతిగోచరము కాలేదా? గుణలవములేని తిర్యగ్జంతువునెడ నెందులకీ బహుమానము? గతానుగతికముగ లోకు లీభాతిఁ బలుకుచుందురు గాఁబోలు!

భీము—(కోపముతో నవ్వి) నిశాచరగృహవాటికలు లను నగ్నిజ్వాలలచే నెవ్వని బాహుబలము విఖ్యాతము నొందెనో అట్టి త్రిభువనైకవీరుని మ్రోల నీలోకమునఁ గల వీరాగ్రేసరు లెట్టివారలు? ఓ శాఖామృగమా! హనుమంతుం డన నెట్టివాఁడో నీకుఁ దెలియునా? సౌమిత్రివక్షఃస్థలీశల్యాకర్షణశస్త్రకర్మయందుఁ గనుపఱచిన విక్రమపరాక్రమము వినలేదా? నే నిప్పుడా మహామహుని గుణముల దెల్పెద వినుము. తెలిసినవానివలెఁ జెప్పుచున్నాఁడనే కాని యట్టి మహాత్ముని గుణములన్నియుఁ జెప్పుటకు నే నెంతవాఁడను!

గీ॥ ఎవ్వఁ డద్భుతబలదర్ప • మెసఁగఁ గలనిఁ  
గదిసి రాక్షసభట బలా • కర్షణంబు  
జేసి లంకేశు విస్మితుఁ • జేసె, నట్టి  
హనుమమహిమంబు నెన్నఁగా • నగునె మనకు?

లోకత్రయవిఖ్యాతమును ప్రౌఢమును నద్భుతమును నగు నట్టి మహత్కార్యము మరియెవ్వఁడు సేయంగలాఁడు?

హను—ఏమి, పాండవా, క్రోఁతిగదా! ఎందు కటుల నతిగౌరవముగ సంభాషించెదవు? జరాసంధాదిరాక్షసవధనమందు చాలనేర్పరివై

నట్టినీవు వీరులయందగ్రగణ్యుండవు. అట్టియెడ వనచరుండును, రోగ్య మగు స్తోత్రమున కనర్హుండునునగు నొకక్షుద్రవానరునియందలి సుగుణములఁ దెల్పుట కేననమర్థుండనని పల్కుట పౌరుషవంతుఁడ వగు నీకుఁ దగునా?

భీము—(సక్రోధముగ) ఓరీ! ఏమి పల్కుచున్నాఁడవు? క్రోఁతి యని, క్షుద్రమర్కట మనియా? మత్సమక్షమం దిట్టిప్రమాదవచనంబులఁ బల్కెదవా? ఓరీ మూఢా!

గీ॥ తుల్యజాతుండవౌట సంస్తుతి యొనర్పఁ
దగుదు వీ; వటుగా కిట్లు తగుదు నంచు
నధికదూషణ భాషణ మాచరింప
దొరకొనుదె? ఛీ! స్వజాత్యైకదూష! నీవు.

అమ్మహానీయుని నిందించుటకును, స్తోత్రముచేయుటకును, నీ వెంతటివాఁడవు?

గీ॥ కాన గిరికంధరముల నెక్కడనొ తిరిగి
మనెదు నీ వేడ, లోకరక్షణ సమర్థ
మైన బలసంపదనుగన్నయట్టి మహిత
గుణుఁడు హనుమానుఁ డేడ నో కుపితచరిత!

ఆసచ్చరితుండు వాయుభగవానునివలన జన్మమొందినవాఁడు. కేవలము జాతితోడనె నీకు సమానుఁడుగాని క్రియలచే గాఁడు. అందుచే నీకుఁ దుల్యుఁడునుగాఁడు. కావున నీయొక్కనితో నమిత్రహో జనము? ఎవనికి బాల్యమందే సూర్యబింబము ఫలప్రాయమయ్యెనో, ఎవనికి సముద్రోల్లంఘనము పల్వలముదాటుట యాయెనో, ఎవనికి క్రూరరాక్షసభంజనము ద్రుమభంగసదృశమయ్యెనో అట్టి క్రోఁతి యెక్కడ, కాంతార దుష్టగ్రహము లగు తక్కుంగల క్రోఁతు లెక్కడ!—

హను—(సోపహాసముగా) రాజపుత్రా! బాగుగఁ జెప్పితివి. చాల నేర్పరివి. ప్రగల్భవంతుఁడవు. ఇట్లు పలికెడి నిన్నుండియే యాహను

మంతునికిఁ బ్లవంగత్వము సిద్ధించియుండనోవు. మాయం దేమి దోష మున్నది ?

భీమ—లేకేమి; ఆమహావీరుం డింతమాత్రముచేతనే తిరస్కృతుం డగునా ? సీతాన్వేషణమందును గకుత్స్థవంశరత్నంబులగు రామలక్ష్మణుల జీవదానమునందును, ఆమహామహాబాహులు దక్షిణోత్తరదిగంతంబులవఱకు వ్యాపించియుండలేదా ?—

హను—(తనలో) ఇతని భ్రాతృప్రేమ వర్ణనాతీతముగదా? నేఁ గొంచెముచేసినను దానిం గొప్పగఁ బ్రశంసించుచున్నాఁడు. నేను సోదరుండ నని తెలిసిన, నిజముగ సంతోష మాపఁజాలఁడు. యుధిష్ఠిరునందుకంటె నాయం దెక్కుడు ప్రేమఁ గన్పఱచుచున్నవాఁడు—మరియు కఠినభాషణేంధనములచే నీతని కోపానలజ్వాల నించుక ప్రజ్వలింపఁ జేసెదఁగాక! (ప్రకాశముగ) ఎవని శరీరము జ్యావా పృథివియొక్క నాస్తికత్వమును దెలియపఱచుచున్నదో, ఎవ్వని యుదరమునఁ బాతాళము కుళీరగర్తతుల్యముగ నుండెనో, ఎవ్వనిచే నెల్లసముద్రములు లంఘింపఁబడెనో, అట్టి మహావీరుఁడు కోతి యనికదా చెప్పుచున్నాఁడవు—ఇది నమ్మదగిన విషయమా ? ఇట్టివాఁడు లోకమున నుండునా? ప్రపంచమునఁ జూడ నిది యొకకళంకముగ నున్నయది.—

భీమ—ఓయి! నీవు చార్వాకునింబలె నిర్వివేక హృదయుండ వగుచున్నాఁడవు. దేవతలచే సైతము శ్లాఘ్యము లగు వాయునందనుని కథలయందు నీ వేహేతువుచే సందేహపడుచున్నాఁడవు ? చూడుము. సముద్రము నాఁ డందిన భయకంపము నిప్పటికిని దరంగఘోషములమూలమునఁ గన్పఱచుచున్నయది.

హను—(ఆక్షేపణగ) ఏమి నీ ప్రమాణరహిత మగు నుపన్యాసము!

భీమ—అట్లనకుము. ప్రత్యక్షముగ నిర్ణయించుటకు శక్యముకాని దాని నిప్పు డనుమానప్రమాణముచే నొకత్రుటికాలముననే చెప్పి నిను నమ్మించగలను.

హను—సరి. అట్లయిన నంగీకరించెద.

భీము— ఓయి! జలరాశిలంఘనసమయమున నామహానీయుండు గన్పఱిచిన శరీరభారముచే భగ్నమైన శిఖరము గల మహేంద్ర పర్వతము దక్షిణదిక్కున నిప్పుడు సాక్ష్య మిచ్చుచుండలేదా?

హను—(తనలో) ఈ కుఱ్ఱండు బాగుగఁబల్కెడిని. ఇదియు నంగీకరింపక తిరస్కరించి యాడుగఁగలను. (ప్రకాశముగ) ఓ భీమసేన! నీ విప్పుడు చెప్పినది నే నమ్మఁజాల. ఇట్టివాఁడు హనుమంతుండే యని నేను గౌరవించను.

భీము—ఎవ్వండవు నీవు? ఎన్నఁడు విననట్టి సంభాషణముఁ జేయుచున్నాఁడవు. లంకాపట్టణమున గొప్పసాహసము గనుపఱిచినవాఁడు. రక్షఃప్రియారోదనస్వాధ్యాయ ప్రణవోపదేశ గురుండు; వీరాగ్రేసరుండు. శూరుండగు నక్షయు మర్దించి దశకంఠుని శోకసంతప్తహృదయుం జేసినవాఁడు. అట్టి హనుమంతుం డెవ్వనిచే సన్మానింపఁ బడఁదగఁడు?

హను—ఓహో! ఎన్నఁడు విననిది. అపూర్వము! తుచ్ఛుండగు నొకానొక రాక్షసశిశుమర్దనమా చేసినది? భీమసేనా! ఇదియేనా? అక్షయుని రణరంగమున నుదగ్రముగ జయించినాఁడని చెప్పితివి. అంతమాత్రమున హనుమానునియం దెట్టి పరాక్రమ మంగీకరించితివి? — ఇంద్రజిత్తుకూడ నతనిచే నిర్జింపఁబడెనేని యట్టులఁ గొనియాడుట కాతండు తగియేయుండును. కాని యింతమాత్రముచేతనా యిట్టి పొగడికలు? కష్టము కష్టము—మీఁదుమిక్కిలి ఇంద్రజిత్తునిచే సంగరరంగమున నాఁడుదాన్నివలె బంధీకృతుండైనవాఁడు. అత్తఱి నాతనికి శత్రువలనఁ గల్గిన పరిభవముకన్న మరణమే మేలుగదా!

భీము—(సకోపాట్టహాసముగ) ఓ శాఖామృగమా! జ్ఞానహీనుండవగుటచే నిజమగు ప్రౌఢత్వమును స్తోత్రముజేయక మీఁదుమిక్కిలి

వ్యతిరేక మగుదాని శ్లాఘించుచుంటివి. జ్ఞానలవముగల్గిన నీవీ తీరున వ్యతిరేకసంభాషణము చేయుదువు. ఒకే పక్షమున సంభాషించుచుంటివి. పెద్దలయెడ నీ విటులాడుట పాడిగాదు. మరియు, నోదుర్విదగ్ధా! హనుమంతుండు తన బంధనము తనంతఁ దాన యభినయించె. లేకున్న నూర్గు రింద్రజిత్తులు వచ్చినను హనుమంతుండు బద్ధుం డగునా?

హను—ఔనౌను. నిజము గుర్తెఱుంగనివా రిట్లే పలికెదరు. ఇంతకన్న లజ్జాకర మగు కార్యము హనుమంతునకు వేరొకటి కలదా? ఒక్క క్షణమున నిర్జరబృందముతోడ నింద్రుని జయించిన యింద్రజిత్తుచే నాంజనేయుండు బందీకృతుం డయ్యెనుమా! ఏల యనవసరముగ దాని దాచెదవు? ఇంద్రునికంటె నాంజనేయుం డధికుండా?

భీము—శత్రునిచే బలాత్కారముగ హనుమంతుండు బంధింపఁబడినట్లు తలంచుచున్నాఁడవు. కాని యక్షయకుమారుని మాత్రము నిర్జించుట కొరునికి శక్య మగునా?

హను—(నవ్వి) విభీషణానుగ్రహమున హనుమంతుండు బ్రతికె. విభీషణనయసంభాషణము రావణు నరికట్టె. లేకున్న సుతద్రోహియగు హనుమంతునిఁ జంపుట రావణునికెంత? సహనమే లేకున్న జంభాసురాది దిక్పాలుర శిక్షించిన రావణుని చంద్రహాసము సహించియుండునా?

భీము—(కోప మభినయించును.)

హను—(తనలో)ఇది యేమియాశ్చర్యము! పండ్లు గీటింపుచున్నాఁడు. నేత్రములు రక్తిమ నొందుచున్నయవి. అధరము కొరుకుచున్నాఁడు. కపోలములు చెమ్మటపట్టుచున్నయవి. కనుబొమలు ముడివడు చున్నవి. ఈ వికారము ముఖమందలి కోపారంభము చెప్పక చెప్పుచున్న యది. నాపైఁ బడునని యనుమాన మగుచున్నది. అయినను నదియుఁ జూచెదఁగాక.

భీము—(కోపముగ) ఓరీ! దుష్టమర్కటమా! లంకాపురీనివాసులగు వీరభటులసారము బాగుగ గుర్తెఱింగిన బాహుబలము గల యా మహావీరుఁడు సర్వజ్ఞుఁడు. అట్టి మహావీర సవమునఁదు వినిన దంతయు వ్యతిరేకముగ భాషించుచున్నాఁడవు. ఇట్టి విపరీతసంభాషణసేయు నీవు మహాపాపివి. ఇట్టి నిన్ను మననీయఁదగదు. కావున నీ వాలముంబట్టి గిరగిరద్రిప్పి నేలంగొట్టి నిను మట్టుపెట్టెదను చూడుము. (అని వాలము నెత్తఁబోవును. కదల కుండును)

(తనలో) ఏమి యాశ్చర్యము! నాబలంబంతయు నీవాలము నెత్తఁజాలకుండెనే! చూడ నీతఁడొక మాయావివలె నున్నాఁడు. (లేచి ప్రకాశముగా) ఓరీ! నీవు నను వంచింపవచ్చిన మాయరక్కసుఁడవని యిప్పుడు తెలిసికొంటిని. బకాసురునియింటికి నిన్నతిథిగ నిప్పుడే పంపెదను చూడుము. అదిగో ఆసాలముం బెరికి తెచ్చి దానిచే నిను మోది చంపెదను. (అని తెరలోని కుఱుకును)

హను—(తనలో) నాపరీక్షించుటచాలును. ఇంక వీనిం బ్రసన్నునిఁ జేసెదఁగాక. నిజస్వరూపముఁ దాల్చెదను (అని తెరలోని కరిగి నిజరూపమున వచ్చి కూర్చుండియుండును)

భీము—(తెరలో నుండి) ఓరీ నిశాటా!

గీ॥ మాయవేషంబు దాలిచి • మహితయశుని
సచ్చరిత్రంబు మృష యంచు • ముచ్చటించు
నిన్ను నీవటభూజాన • నిహతుఁ జేతు
హనుమపదపద్మములయాన • గనుమి యిపుడె.

(అని యొక చెట్టుతో వచ్చి నిజరూపమున నున్న హనుమంతునిఁ జూచి) ఇది యేమి? పెద్దలు సెప్పెడి వర్ణనమునకు సరిపోయి యున్నాఁడు. హనుమంతుండా యేమి? లేక యిదియు నీరక్కసిమాయయా? (వినుట నభినయించి) ఆహా! అశరీరవాణి యే మనుచున్నది! నిజముగ నంజనీతనయుండనియా? ధన్యుఁడను! ధన్యుఁడను! (వృత్తము

పారవైచి) అయ్యో! ఎంత పొరబడితిని! యెంతపని చేసితిని! (సమీపించి) అన్నా! హనుమన్నా! క్షమియింపుఁడు. నాజన్మంబు ధన్యత నొందె. (పాదాక్రాంతుఁడై)

ద్విపద.

జయ దయాపాథోధి ♦ జయపుణ్యమూర్తి!
జయ దశదిగ్వ్యాప్త! ♦ సాంద్రసత్కీర్తి!
జయ దీనపోషణ! ♦ జయసత్ప్రసాంగ!
జయ జయ శ్రీరామ ♦ చరణాబ్జభృంగ!
జయ జితదైతేయ! ♦ సన్మునిగేయ!
జయ భక్తఫలదాయ! ♦ జయ యాంజనేయ!

క॥ అపరాధిని దురితాత్ముఁడఁ
గపటమతిన్ జడుఁడఁ గన్న ♦ గానక మీకే
నపచార మొనర్చితి నన్
గృపతో మన్నింపఁగదవె ♦ కేసరితనయా!

హను—(గ్రుచ్చియెత్తి) తమ్ముఁడా! నీశక్తిసామర్థ్యంబు లెఱుంగఁగోరి యిట్లొనర్చితిని. నాయందు నీకుఁగల యవ్యాజప్రేమము దెలిసికొంటిని. సంతసమయ్యె. నీవెద్దియేని గోరు మిచ్చెదను: దుష్టులగు దుర్యోధనాదులతోఁ బోరుకల్గినయెడ నీపక్షముననిల్చి నీకు జయంబు చేకూరఁజేసెదఁ,—గావలయునా?

భీము—మహాత్మా! తమయంత మహాశక్తివంతులము కాకున్నను దుర్యోధనాదుల నిర్జించుటకుఁ దమవంటివారికి శ్రమనియ్యనక్కరలేదు. అయినను నట్టిది సంభవించినఁ దామాసమయమున మా విజయము ను గోరుచు నటనిల్చి సంగరప్రదర్శనమును గాంచఁగోరెదను.

హను—అట్లయిన నర్జునుని రథకేతనమున నిల్చియుండెదఁగాక.

భీము—మహాప్రసాదము. ధన్యులము!

హను—ఇంక నీకు సౌగంధికములున్న జాడలఁ దెలుపవలయునా?

భీము—మహాప్రసాదము! (అని చేతులుజోడించి నిల్చును)

హను—(పైనఁ జేయివైచి) ఇక్కడికిఁ జక్కఁగ నుత్తరమునకుఁ బోవంబోవ రజతాచలం బొండు గన్పడియెడిని. అప్పైఁ గొంత దవ్వరిగితివేని,

సీ॥ రజతకాంచన నవ ♦ రత్న సంకలితమా
సాలగోపురధామ ♦ జాలకములు
లాలితాగణ్య క♦ల్యాణ సంపదల కా
ధారంబగు నవని♦ధానములును
వలనొప్పు పుష్పక ♦ ప్రతిమానతఁ దనరించు
నానామణిస్యంద♦నప్రతతియు
శతధృతికైన నెం♦చగరాని ఘనబలో
న్నతులగు యక్షాధి ♦ నాయకులును
గలిగి భూలలనా మణి ♦ వొలుపు నిలుపఁ
బెట్టినొనినట్టి పాపట ♦ బొట్టొయనఁగ
నమరు నగభేది పుటభేద♦నముసకన్న
రమ్యతరమైన యలకాపు♦రం బొకండు.

అప్పట్టణంబునకు శౌర్యాటోపుండును దినరాడ తేజో విరాజితుండును, నరిభయంకరుండును, గఱకంఠు పరమమిత్రుండును నగు కుబేరుం డధిపతి. అతండు విహారార్థము బహువిధఫలవృక్షతరు లతా వితానముచే నతి రమణీయంబగు నొక యుద్యానవనంబు నిర్మింపఁ జేసె. అద్దాని మధ్యంబునఁ గాసారం బొండుకలదు. అందు కనక కుసుమంబులు కలవు. ఆ కొలనికి నలుగడల మహాబలోపేతు లగు యక్షదానవ గంధర్వ కిన్నరులు క్రమముగఁ దమ తమ బలంబుల తోడ జాగరూకులై కావలి యుందురు. వారల సమరంబున

సాధించి కమలంబులఁ దెచ్చుట కష్టసాధ్యము. కావున దేశ కాల పాత్రమ్ము లెఱింగి ప్రవర్తించి సఫలీకృత మనోరథుండ వగుము.

భీము—చిత్తము. (అని నమస్కరించును.)

హను—విజయోస్తు! విజయోస్తు! (నిష్క్రమించును.)

భీము—(నడచుచు) ఈ హనుమద్దేవుఁడు చెప్పు విధముం గన నేను రజతాద్రికవ్వల గల కుబేరనగరమునకుఁ బోవలసి వచ్చెను. కాని మా యన్న నారామికై యెంత విచారించుచుండునో కదా?

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము



శ్రీ
హయగ్రీవాయ నమః

# భీమప్రతిజ్ఞ

## చతుర్థాంకము

(ధర్మజ, నకుల, సహదేవుల ప్రవేశము.)

ధర్మ—తమ్ముఁడా, నకులా!

గీ॥ వనవిహారంబు సేయుంగఁ • జనినయట్టి
ద్రౌపదియు భీమసేనుండుఁ • దడసి రింకఁ
జేర రారైరి; ద్విజరాజి • చేరె గూండ్ల;
కింక మసలుటకేమి యూహింపనైతి.

అదేమొ కాని వామభుజంబు వేమా రదరుచునుండె. ఏమీ యీ యపశకునంబులు! అయ్యో! యెంత వలదని వారించినను నావంతయు వినక తాఁ బట్టిన కుందేటికి మూఁడేకాళ్ళని పట్టు బట్టి చని నట్టడవుల నేగుట్టల పాలైరో కదా? అయ్యో!

నకు—అగ్రజా! ఏల మీరిట్లు చింతిల్లెదరు? వనమునం దందందుఁ గల చోద్యముల నేత్రానందంబుగఁ గన్గొనుచు వారిరువురుఁ గడు దవ్వరిగి తిరిగి వచ్చుట కొక్కింత యాలస్యంబయి యుండ నోపు. అంతియె కాని మఱొండు కారణంబుండదు. దినకరుండు చరమదిశ కరుగు చుండెఁ గాన నీక వారియ్యెడకే మఱలి వచ్చుచుందురు. అయినను జూచివచ్చెదను. (కొంతదూరమున కేగి నలుదిక్కులఁ జూచి ఆతురతతోఁ దిరిగి వచ్చి) అగ్రజా! విచారింపకుఁడు.

అల్లదిగో, అనతిదూరంబున నొక యరదంబుపై నిర్వు రిచ్చోడ కేతెంచు చున్నట్టులఁ గన్పట్టు చున్నది. వారలు మన ద్రుపదరాజ నందనియు, భీమసేనుండును నని తోఁచెడిని.

ధర్మ—అట్టులనా? వారలిం కెంత దవ్వున నుండిరో!

నకు—(చూచి) అదిగో యిటు వచ్చుచున్నారు—భీమసేనాత్మజుండును, మన ద్రౌపదియు.

(విన్నఁబోయిన మోముతో ద్రౌపదియుఁ, బుష్పముతో ఘటోత్కచుఁడును బ్రవేశింతురు.)

ఘటో—జనకా! నమస్కరించు చున్నాఁడ.

ధర్మ—ఆయుష్మాన్భవ! కుమారా! నీతండ్రి యెక్కడ?

ఘటో—తండ్రీ! ఈ కనకాబ్జమ్ముం గొనుఁడు.

ధర్మ—(అందుకొని, చూచి, ఆఘ్రాణించి) ఆహా!

గీ॥ అబ్జ లావణ్యమును గొని॥యాడ వశమె
పూవు సత్తావి నింతని ♦ పొగడఁ దరమె
ధర్మ నిర్మితమై సౌర♦భంబుఁ గనుట
దీని కెనయగు దాని జ♦గానఁ గాన.

సరియె కాని, నాయనా! మీనాయన యెక్కడ? (ద్రౌపదిం జూచి) అదియేమి? ఏలొకో యీపాంచాలనృపాలునిబాల బాల చంద్రునిం బోలు నిటలాలకంబు వ్రేల వైచి తెల తెలఁ బోవుచు మది కలంగిన తెఱంగునఁ గన్పట్టుచున్నయది. ఏమియుఁ గీడు మూడదుకదా? పాపంబు శమించుఁ గాక! (ద్రౌపది నుద్దేశించి) పాంచాలరాజనందనీ! భీమసేనుం డేడ?

చ॥ వలదని పెక్కుభంగులను ♦ బల్కిన నీచెవి కెక్కనీక పో
వలసిన దే యటంచుఁ జల♦పట్టి గదాయుధుఁ గూడి కాననం
బులఁ దిరుగాడ బోయితివి ♦ పో, పవనాత్మజు నెందుఁ బంచితో
తెలుపుము మీర లిందు జను♦దెంచియు నాతఁడు రాకయుంటకున్.

దాసి—(తలవంచి కన్నీ రద్దికొనుచు గద్గద స్వరమున)

శా॥ భూనాథా! భవదాజ్ఞఁ గైకొని వనం◆బుం జొచ్చి మీ సోదరుం
డేనుం బోవుచునుండ మార్గమున మే◆మీ పుష్పరాజంబు నే
త్రానందంబుగఁ గంటి; మట్టి నవహే◆మాబ్జంబులం దెమ్మనం
గా నాకోరిక దీర్త నంచుఁ జనియెన్ ◆ గాంతారమధ్యస్థలిన్.

ధర్మ—ఆహా! యెంత మోసము పొసఁగె! కుమారా! హిడింబ భాగినేయా!

ఉ॥ దానవనాథ! నాయనుఁగుఁ ◆ దమ్ముఁడు భీముఁడు తోడు వీడి తాఁ
గానకు నేగె హేమసుమ◆కాండములన్ గొని తేర; నయ్యెడన్
దానవసిద్ధ యక్షసుర◆నాథులుఁ గ్రిమ్మరఁ బోలు నక్కటా
తా నెటు వారలం గడచి ◆ తమ్ములఁ దెచ్చునొ శోఁచకుండెడిన్

అచట నేమోసము పొసఁగెనో. లేకున్న దా నేల రా నాల సించు? ఎవ్వరు సాయపడి యుందురు? కలహం బెంత బహుళం బుగ గల్గెనో? (ఘటోత్కచు నుద్దేశించి) అయ్యో, తండ్రీ! నీ వీక్షణం బచటికిఁ జని, మీతండ్రి సేమం బారసి, యామేలువార్తఁ దెచ్చి నా వీనులకు విందొనర్పకుంటి వేని నామదిఁ గల దిగులు తీర నేరదు. సత్వరంబుగఁ బొమ్ము నాయనా!

ఘటో—జనకా!

ఉ॥ పావనమూర్తి! యోమహిత ◆ బంధురకీర్తి! భవత్పదాబ్జసం
సేవ నొనర్చుచున్ గొలుచు ◆ సేవకుఁ డే నిటనుండ, నిందిరా
దేవికిభర్తయైన వసు◆దేవకుమారకుఁ డాప్తబంధుఁడై
కావఁగఁ దా నటుండ భయ◆కారణ మెన్నఁడు గల్గనేర్చునే?

యుష్మ ద్దయా వీక్షణంబులే భవత్సహోదరులకు వజ్రకవ చంబులై చెలంగు. వారలు తమ సన్నిధి నున్నంతవర కా శితికం ఠుండైనఁ జెనకఁ గల్గునా? అయినను తండ్రీ! మీ మనమునం దనుమానము కలదేని యుల్లే వాయునందను గలయ వనము నకుం జని.

కా॥ముల్లోకంబులు నెత్తివచ్చినను నిర్మూలించి మాయయ్య క
త్యుల్లాసం బొనఁగూర్చి, కంజముల సౌంపొప్పారఁగా దెచ్చి, మా
తల్లిం జేయు దభీష్ట సిద్ధివడయుఁగా, దండిగ్రా మరుత్పుత్రుఁడు మీ
కెల్లం జూపి, ముఖంబుఁ గూర్తు నిదిగో యేనిప్పు డిప్పట్టునన్.

ధర్మ—కుమారా! నీ శక్తికి సంతసించితిని. (ఒకదిక్కు చూచి) అల్లదిగో, నారదమహామునీంద్రుం డిటకు వచ్చుచున్నవాఁడు. ఆ త్రిలోకసంచారిచే మన భీమసేనునిజాడఁ దెలిసికొని యావలఁ బోవు టుచితము. కావున యొక్కింత యాలసింపుము.

(నారదుఁడు పాడుచుఁ బ్రవేశించును)

ధర్మ—(ఎదురేగి) మౌనికులావతంసా! నమస్కారము.

నార—జయోస్తు! జయోస్తు!

ధర్మ—భవద్దర్శన సుకృతంబుచే మదీయ జన్మ సాఫల్యంబయ్యె. అయ్యుచితాసనము నలంకరింపుఁడు.

నార—(కూర్చుండి) ధర్మనందనా! ఏల నీ విట్లున్నాఁడవు? విశేషము తేమి?

ధర్మ—స్వామీ! ముల్లోకంబులం దెల్లయెడలఁ గలయఁ దిరుగు భవాదృశ మునితల్లజులకుఁ దెల్లంబుగాని విశేషంబు లున్న వనుట కల్ల. అట్టి యెడ నెఱుఁగనట్లు నన్నడిగెద రేల? అయినను నావలన వినఁగోరుదురేని విశదీకరించెద నవధరింపుఁడు. నాతమ్ముం డగు భీమసేనుండు సౌగంధికకుసుమంబుల కేగి యింకను రాఁడయ్యె. అదియే విషాద కారణంబు. త్రిలోక సంచారు లగు తా మిప్పుడు "భీమసేనుం డెందుండె? సేమంబుగ నుండెనా?"—యీ మేలువార్తలు నా కెఱింగించి నన్ను సంతుష్టాంతరంగుం జేయ వేఁడెద.

నార—చింతిల్లకుము. (దివ్యదృష్టిం జూచు టభినయించి) ధర్మనందనా! తెల్పెదను వినుము.

మ॥ అవనీనాథ! భవత్సహోదరుఁడు తా నబ్జాక్షి కిష్టంబుఁ గూ
ర్ప వనంబందుఁ జరింపుచుండ నొకచో వాతాత్మజుం గాంచి పో
వువిధం బాతనిచే నెఱింగి చని యంభోజాకరంబుం గనెన్
రవి యస్తాద్రికిఁ జేరునంత కట నో రాజన్యచూడామణీ!

చూచి, యాకమలాకరంబునం గల సుమకాండంబులం గని సంతసిల్లి వానిఁ గొనిపోవుదునని యాపొంతఁ గావున్న యక్ష, రాక్షస, గంధర్వ, కిన్నర బలంబుల కధ్యక్షు లగు వారలకుఁ దెల్ప వారు తమ యేలిక యగు కుబేరుని యనుమతి వడసి తీసికొని పొమ్మని నుడివిరి. అందుల కాతండు. 'ఓయీ! యీ సరోవరము పర్వతరాజ మధ్యంబునం గల సెలయేరులచే నేర్పడియె. కాన నిది యెల్లర సొత్తుగాని యొక్కనిసొత్తుగాదు. కుబేరుని సొత్తగుట కాతఁడు క్రయమునకుఁ బడసెనా, లేక మొదట తానే దాని నిర్మించెనా? నేను శ్రేష్ఠమైన క్షత్రియవంశజుండ నగుట నితరుల యాచింప నొల్ల. క్షత్రియుండు తన భుజాబలమునఁ బరవిత్తములఁ గొని యాచకుల కొసంగి కీర్తిచంద్రికల దిగ్భిత్తులఁ బర్వఁ జేయును. కావున నేను మీ కుబేరుని యాచింపక యీ పరస్వనం బ్రవేశించి పుష్పములఁ గొనిపోఁ గూడదా యేమి?' అనుచు వారల సరకుఁ గొనక నాకాసారముం జొచ్చి సౌగంధికములఁ గోసికొను చుండ వారలు కోపించి భీమునితోఁ గయ్యమొనర్పఁ గడంగిరి.—

ధర్మ—ఆహా! ఏమి వీని సాహసము! అటుతర్వాత?

నార—అటుతర్వాత నాబలంబులన్నియు ననిలనందనునిచేఁ బొలియింపఁ బడుటయు, నవ్వార్త హతశేషులవలనఁ దెలిసికొని కుబేరుఁడు తన కుమారుండగు నలకూబరుని సైన్య సమేతునుగ మీ తమ్ముని పైకి రేపకడఁ బంపనుండె. రణంబు దారుణంబుగ జరుగఁ గలదు. కావున నీవు నలకూబరుండు మార్కొనక మున్న

క॥ అనుజులతో విప్రులతో
దనుజ ప్రకరంబుతోడ ♦ ద్రౌపదితోడన్
జనుమీ నరనాథ! యనిల
తనయునిఁ జేరంగ నింకఁ ♦ దడయక వేగన్.

ఇదియే నాయభిప్రాయము. కర్తవ్యం బాలోచించుకొనుము. ఈమార్గంబునఁ జనుచు మీ రిచ్చట నుంట విని మిముఁ జూచు కోరిక నిట వచ్చితి. సంతసమయ్యె. నేఁ బోయివచ్చెద.

ధర్మ—చిత్తము. (నమస్కరించును)

నార—జయీభవ! (నిష్క్రమించును.)

ధర్మ—కుమారా! వింటివా? ఇఁకఁ దృటికాలంబైన నిందుండఁ జనదు. కావున మన మెల్లరము బోవుదము. నీవు నీదనుజబలంబులఁ గూర్చికొని సత్వరంబున విచ్చేయుము. నేనును బ్రయాణ సన్నద్ధుండనయ్యెద.

ఘటో—చిత్తము. అటులనే యొనర్చెద. (నిష్క్రమింతురు)

---

(బదరికావనమార్గము)

నార—(నడుచుచు) ఆహా! నేఁ జేయు నిత్యైకాదశీవ్రతసమాప్తి నేఁడుగదా యొనర్పఁగంటి. ఇఁక ద్వాదశీపారణంబునకు వలయుఁ బరికరంబులఁ జేకూర్చుకొనవలయును. ఇంతవఱకుఁ దండులంబుల సేకరింపఁగల్గితి. ఇంక నవి పచనంబు సేయు, దానిలోనికి శాకంబులును, పచ్చళ్ళును, నూరుబిండులును, నతిరసంబులును, హయ్యంగవీనంబును, పిచ్ఛిలదధియు, నాయత్తపఱచుకొనఁ బ్రయత్నింపవలసియున్నది. ఆహా! నేఁడుగదా బ్రేవుమనునట్లు తృప్తిగఁ గుత్తుకబంట మెక్కనుంటి ఇట్టిభోజనంబు తిరిగి యెన్నఁడు లభించునోగదా! ముందేమియాలోచన? (ఆలోచించినట్లభినయించి)- ఇప్పుడ గజపురంబునకరిగి రాజున కీవార్త దెలిపి, ధర్మనందనునకు సాయపడఁ జనుమని యిచ్చకములఁ బల్కివచ్చెద. ఆపైని దుర్యోధనుండే కర్తవ్యం బూహింపఁగలఁడు. దారినడుచుచుఁ దర్వాత సేయునది యోజించెదఁగాక.

(నిష్క్రమించును)



శ్రీ

హయగ్రీవాయ నమః

# భీమప్రతిజ్ఞ

## పంచమాంకము

— హస్తినాపుర రాజసభ —

(గురు, కృప, కర్ణ, అశ్వత్థామాదులతో దుర్యోధనుని కొలువు)

సేవ—(ప్రవేశించి) కౌరవరాజకంఠీరవా! హజారముకడ నారద మహామునీంద్రుఁడు తమ దర్శనంబునకై వేచియున్నవాఁడు.

దుర్యో—(తనలో) ఈతఁ డెవ్వియైనఁ గ్రొత్తవార్తలఁ గొన్నిటి చెప్పఁ గలండు. (ప్రకా) సత్వరము లోనికిఁ గొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

నార—(ప్రవేశించును.)

దుర్యో—(ఎదు రేగి) మునికులతిలకా! నమస్కరించుచున్నాఁడ.

నార—మనోవాంఛాఫలసిద్ధిరస్తు!

దుర్యో—అయున్నతాసన మలంకరింపుఁడు.

నార—(కూర్చుండి) రాజేంద్రా! నీరాజ్యమునం దందఱు క్షేమమా?

దుర్యో—స్వామీ! భవత్కృపాకటాక్ష వీక్షణంబున నందఱము క్షేమముగ నున్నారము. త్రిలోకసంచారమూర్తీ! త్రిలోకంబులయందు వింత లెవ్వియైనఁ గలవేని విన్నవింపఁ బ్రార్థించువాఁడ.

నార—కురుకులసార్వభౌమా! అన్ని విశేషంబుల కేమిగాని, నీకు హితకర బగు దాని నొక్కటి చెప్పెద వినుము,

దుర్యో—అది యెయ్యది?

నార — సీ॥ అలకాధిపతిసైనికులకు భీమునకును
గలవైన నెఱుఁగని । కయ్యమొదవె
దుర్యో — కయ్యంబునకుఁ గల । కారణం బెయ్యది
చయ్యనఁ దెల్పుమీ । సంయమీంద్ర
నార — కనకాబ్జముల నిమ్మ । టనియున్న నీయన్న
వైరంబు పొసఁగె నో । పార్థివేంద్ర
దుర్యో — కనకాబ్జముల నేల । కావలెనంచు నా
పాండుతనూజుండు । వారిఁ గోరె?
నార — గీ॥ వనవిహారంబు సేయుచు । వాయుసుతుఁడుఁ
గృష్ణయును వనమున సంచరింపుచుండ
నొక్క కనకాబ్జమును గాంచి । యువిద యట్టి
విరులఁ దెమ్మంచుఁ గోరె నా । భీమసేను.
అందుచే నాతండు దవ్విరుల వారి నిమ్మంచు నడిగె.

దుర్యో — సరి సరి. అదియా కారణము! తరువాత?

నార — తరువాత నేమున్నయది? ఆవార్త విని కలఁకఁజెందిన మనంబుఁ గలవాఁడై భూసురాళితోడను, పాంచాలితోడను బదరికావనంబున నుండి ధర్మనందనుఁ డిప్పుడే మరున్నందనుఁ గలయఁబోవుచున్నవాఁడు. పాప మా సమరభీకరుం డగు నగ్రజుం డమరావతీపురంబున కేగి యింకను రాఁడయ్యె. ఇంతకు,

ఉ॥ అక్కట యక్షసైన్యనిచయంబులు క్రూరత భీమసేను నే
యిక్కటు లందఁ జేయునొ? మహీధవ! కౌంతేయవీరుఁడైన దా
నొక్కనిపోర సేర్చునె యనేనిఁ బదిమందికి నొక్కఁడైనచోఁ?
జిక్కఁడె సర్పమొకండు చలిచీమ లనేకము గూడివచ్చినన్॥

కావున నో వీరాగ్రగణ్యా! నీ వేగి భీమసేను విడిపించి కీర్తిచంద్రికల దిగంతములఁ బర్వఁ జేయుము. సాటిలేని క్ష్మానాథుడవు. నీసమ్ముఖమ్మున లెక్క కెక్కుడగు యోధవరు లసంఖ్య లున్నవారలు.

గీ॥ అన్నదమ్ములయం దెట్టి • యలుకలున్నఁ
బరులు తనవారిపై నెత్తి • వచ్చి రేని
యపుడు తనవారిఁ గాపాడ • నర్హ మందు
కాన వారల రక్షింపఁ • గడఁగుటొప్పు॥

ఉన్నది యున్నయట్టులఁ దెల్పితి. అపైని నీయిష్టము. తల్లికి లేని దయ దాదికేల? నేఁ బోయివచ్చెద. (వెడలును)

దుర్యో—చిత్తము. (లేచి కూర్చుండును, సభ్యుల నుద్దేశించి)

గురు కృప కర్ణ గాంగేయాది మహాయోధవరులారా! యీ నారదమాసీందుర్రిం డాడిన వచనంబుల మీరెల్లరు వినియేయుంటిరి కదా? ఇఁక మనము యుద్ధసన్నద్ధులమయి యుండవలయు. రేపకడ పయనంబు సేయవలయు. కావున నేటి కీసభ జాలింతము మీరేగి మీమీ ప్రయత్నంబులయం దుండుఁడు. (లేచిపోవును)

ద్రోణా—(నడచుచు తనలో) ఓహో, ఇది కడు వింతగ నున్నయది. ఏమీ! దుర్యోధనుఁ డేగి పాండవులఁ గావఁజూచునా? నే నమ్మజాల.—అయినను నేనాఁటి కేది యెట్టుల జరుగునో యెవరు చెప్పఁగలరు? దుర్యోధనుండుమాత్రము పాండవులకు సాయపడఁ దలఁపఁ గూడదా యేమి? పాండవులకు మంచికాల మాసన్నమాయెనో, యేమో? అయినను దాని సత్యాసత్యము లిప్పుడే తెలియఁగలవు.

(అందరు నిష్క్రమింతురు.)

---

(కర్ణ దుర్యోధనుల ప్రవేశము.)

దుర్యో—(కర్ణుని చేయిపట్టుకొని) శౌర్యధౌరేయా! గాధేయా! నేఁడుగదా మనకోర్కె లీడేఱఁ గంటిమి.

ఉ॥ కన్నుఁగొనఁ గంటిలో నెరసు • కైవడినున్న పరాక్రమాఢ్యులౌ
యనిలసుతేంద్రసూను లవ • నర్యాధికరంబగు ఖేతిఁ జెందు న

మ్మానమున హాయి గల్గు, ననుమానము లేదిఁక, నేఁడు భీముఁ డా
ధనదు నెదిర్చి త్రెళ్ళుటది తథ్యము తథ్యము యుద్ధభూస్థలిన్.

పగసాధింపఁ బ్రయత్నింపు చున్నంతఁ గాక తాళీయన్యాయంబుగ దానియంత నదియే సంప్రాప్తమయ్యె. అర్జునుం డొక్కరుండు మిగిలిన నాహవస్థలి వాని నిర్జింపనగు. కావున మన మిప్పుడ నిజసేనాసమేతులమై చని ధర్మజుని నకుల సహదేవులను బొలియించి ద్రుపదరాజపట్టిని పట్టి తేవలయు. మంచి తరుణము దొఱకినది.

కర్ణ—(క్రోధముతో) ఏమేమీ, కురురాజాగ్రణీ! స్థూలసూక్ష్మంబు లెఱుంగనట్లు బల్కుచుంటిరి. ఏల భీమార్జునుల నట్లు స్తుతింపు చుంటిరి? ఛీ!

మ॥ శరముల్ విప్రులపల్లెలం దిరిగి భిక్షుం బెత్తి దైన్యంబున
న్పరదేశస్థులఁ బోలెఁ దా మొరులపంచల్ జేరి జీవించు నా
నరునిన్ భీమునిఁ బెద్దజేసెద రొకో నామ్రోల, వారన్న సం
గరరంగంబున నాకులెక్కయె, వడిన్ ఖండింతు దర్పోద్ధతిన్.

నాయంతటి సాహసప్రతిభ గలవాఁడు నీదండఁ గొలువుండ, నయ్యధమాధములం గాంచి మది దిగులంద నగునా? ఆ పందల సాహసంబులు మీ రెఱుంగకుందురా?

ఉ॥ వారలె శౌర్యసంపదలఁ వారికిఁ గల్గిన వారలైన, బెం
పార నెదిర్చి నిల్వరొకొ యాయుధముల్ హరియింప నెంచుచో,
శూరతఁ జూపరారొ సభఁ జూడఁగ ద్రౌపది శోకలాడ్చుచోఁ,
బోరఁగలేరొ తమ్ముఁ బురముల్ వెడలింపఁ గడంగుచున్నచోన్.

కావున నో భూరమణా, సెలవయ్యె నేని నే నొక్కరుండ చని యా భీమార్జునులకుఁ ద్రిమూర్తులు తోడువచ్చినను వారలను నుగ్గునూచంబుగ మ్రగ్గఁ జేయఁ జాలుదు. ఇప్పుడు

మ॥ కవలన్ ధర్మతనూజు సంగరమునన్ ♦ ఖండించి పాంచాలి నే
నవలీలన్ గొనితెచ్చి యర్పణముఁ జే♦యంజాలుదున్ మీకు...

దుర్యో—(కౌగలించుకొని) రాధేయా!

సీ। జవసత్వంబు లెఱుంగనే దివిజులన్ ♦ సాధింపఁగా శౌర్యమ్ము, నీ
భువి సామాన్యుల బాండుసూనులను ని♦ర్మూలింప లేకుందువే?

నీ మనం బెఱుంగ నట్లంటిఁగాని వీరాగ్రగణ్యా! భీతిచే ననుట గాదు. నీవంటి శౌర్యాటోపుం డీ భూమండలంబున నుండునా? అట్టి నీవు నాకడనుండ నాకేటి వెఱపు? అకారణంబుగ నీమది నొప్పించితి నందులకు నన్ను మన్నింపఁగోరెద.

కర్ణు—(ఊప్పొంగుచు) రాజమార్తాండా! మీయట్టివాని నేనా మన్నించుట! పాండవులఁ బొగడుటలు మీవలన వినుటచే జనించిన కోపానలజ్వాలలకుఁ దాళంజాలక నే నట్లంటిఁగాని మరొక్కటికాదు. మనమింక నిముసంబైన మసలక పాండవవనదహనంబునకుఁ బోదము రండు. (నిష్క్రమింతురు)

---

బదరికావన ప్రదేశము.

(ప్రవేశము—దుర్యోధన, భీష్మ, ద్రోణ, కృపా, శ్వత్థామ, కర్ణులు.)

దుర్యో—(వెదకుచు నాతురతతో) అంగరాజా! పాండవు లెక్కడ? ఇదియేకదా నారదమానీంద్రుండు తెల్పిన స్థలము? ముందేగి యుండిరా యేమి? (దూరమునఁ జూచి)

చ॥ అదెయదె పోవుచుండి రివు ♦ డల్లదె కంటిరె పాండుసూనులన్
వదలక వెంటనంటి యమ♦నందను నీల్గఁగఁ జేసి తమ్ములన్
జదియఁగఁగొట్టి, తెమ్ము జల♦జాయతనేత్రి, సువర్ణగాత్రి, ష
ట్పదకులవేణి, నాజలజ♦పాణినిఁ, బాండుతనూజురాణినిన్.

భీష్మ—(కోపముతో) దుర్యోధనా! ఏమీ? ఇంతటి దుర్మార్గమా? ఇట్టి దుష్టచేష్టలు నిన్నుఁగట్టి కుడుపవా?

మ॥ ఘోరతరంబగు పాపచయంబులఁ ♦ గొంకక చేసిన నారకకే పో
నేరున, ధారుణినొందవె నీవిట్టు ♦ నయ్యన్యముఁ జూపఁగవచ్చియు ముం
దారయ కే కుటిలంబుఁ దలంచుట ♦ న్యాయమె భూవర! శత్రుఁడవై
పోరఁగరాదె హుటాహుటి నిల్చి న ♦ నుజ్జ్వలకీర్తు లెసంగ ననిన్.

ఛీ! ఈ రేడు జగంబుల నీ చెడు బుద్ధులఁ దలంచిన మాత్ర, నే మానిసి కైన హాని వాటిల్ల కుండునా? ఔరా, ఏమి నీ దుర హంకారము! నిన్ను నీ వెఱుంగ వైతివి?

చ॥ "అరయఁగఁ బాండుసూను లరు♦దైన పరాక్రమవంతు లెంతయున్
హరికృప వారిపట్లఁ గల, ♦ దా రణవీరులఁ గెల్వ నేరికిన్
దరమగు, వీరిలోన నిది ♦ తప్పని చెప్పఁగలాఁడు లేఁడె" యం
దురు జనులెల్ల; మమ్ముటుల ♦ దూఱులఁ జేయఁ దలంపఁబోకుమీ!

మా యపకీర్తిఁ బాయఁ జేయుట కయిన మానుదులఁ జెవినిడి, యవ్వాడువున నడిచిన బాగుపడఁ గలవు. కాదేని నీ దుష్ట చతుష్టయముతోడ నీ చతురంగ బలంబులు గలసిఁ బొలియఁ గలవు.
(అనియొక పుల్ల విరిచి వైచును)

కర్ణ—(కోపముతో) శంతనతనూభవా! శత్రుపక్షపాతీ!

చ॥ వెఱపోకయింతలే కిటుల ♦ వెంగలిపల్కుల బల్కనౌనె? యం
దఱికిని దాతనంచు మదిఁ ♦ దట్టిన గర్వముతోడ తేనిసుం
దఱ మము సడ్డసేయ కన ♦ ధర్మమె పో, హితశత్రులంచు ని
మ్మెఱుఁగమె, పాండవేయులన ♦ నెక్కుడుగాఁ బడిచత్తురెవ్వరున్.

కావున

ఉ॥ పాండవులన్న నెంత? యదు♦పాంసనుఁ డుండిన నెంత మాకు? భూ
మండలిలోన మమ్మెదిరి ♦ మార్కొనఁజాలిన వీరుఁడున్నె? ఛీ!
భండనమందు నిల్చినను ♦ పాండుసుతుల్ పదు పాట్లఁ జూడు, వే
వండపురాధినాథుదరిఁ ♦ దత్తరమందుచుఁ బల్కనయ్యెనే?

ఆచార్యా! సంగర రంగంబుననిల్చి రిపుసంఘుల నిర్జించుటయో లేక వారి బారిఁ బడుటయో శూరుని దారి. అటుగాక,

ఉ॥ కేలను బాణముల్ దొడిగి ♦ క్రించుదనంబున నిల్చియుండఁగా
నేల? విరోధిసైన్యముల ♦ నెక్కుడుగాఁ దలపోసి కుందఁగా
నేల? శరంబుల న్విడిచి ♦ యిప్పుడె చావఁగరాదె? యొప్పుగన్
బోలును గాజులందొడిగి ♦ మూల వసింపఁగ స్త్రీలపోలికన్॥

అశ్వ—ఓరీ, వ్యర్థప్రలాపీ! ఏమేమీ? (దుర్యోధనునిఁజూచి) కురురాజాగ్రణి! ఆసూతపుత్త్రుఁ డెట్లాడుచున్నాఁడో చూడుము. అనీచుఁ డట్లు పేలుటకు,

చ॥ కల దొకతప్పు నీయెడను, ♦ కౌరవ వంశపయోధిచంద్రమా!
ఖలుఁడగు సూతపుత్త్రునకు ♦ గాఢిలి మిత్త్రుఁడవై మెలంగుచున్
మలువతనంబుచే నతఁడు ♦ తోఁచిన యోజనలెల్లఁ బల్కఁ గే
వల మవి వేదవాక్కులని ♦ భావమునం దలపోయుచుంటచేన్.

ఇదియే నీపట్లఁ గల నేరము. కాని,

ఉ॥ రంగగుమైత్రి నాతఁ డను♦రక్తి మెలంగుచు నచ్చఁ బల్కు తా
సంగర రంగమందు నినుఁ ♦ జావఁగఁ జూచెద నంచు నాత్మ ను
ప్పొంగుచు నున్నవాఁ డతని ♦ మోసమెఱుంగవు; వీనిఁ గాంచుమీ
యంగిటియందు బెల్లమును ♦ నాత్మవిషంబు గలట్టివానిఁగన్.

నిన్నిట్లు చేయుదునంచుఁ గంకణము గట్టియున్నవాఁడు. అదియు నుంగాక.

చ॥ కదలని బంటువోలె, ధను ♦ కార్ముకమున్ వడిఁ గేలఁ బూని తాఁ
గదనము నందునిల్చి నినుఁ ♦ గయ్యమునన్ గదియించి, మించి రా
మొదలక పారిపోవఁగల ♦ మేటిసుమీ మన సూతపుత్త్రుఁ డో
సదమలగాత్ర! యీ ఖలుని ♦ సాహస మెన్నఁ డెఱుంగకుందువే?

మఱియు, నీ దుష్టుండు భవత్సామ్రాజ్యమునకుఁ దోఁచిన ధూమకేతువు రీతి నున్నవాఁడు. కౌరవరాజేంద్రా! దుర్యోధనల

మాని పాండుసూనులకు సాయము సేయుంజనుఁడు. లేదేని యా రాధేయునితోడ నీ బలంబులన్నియుఁ గలనిఁ బొలియఁ గలవు. ఇది నిశ్చయము.

కర్ణుఁడు—ఓరీ! పిరికిపందా ! వాక్యూరా !

గీ॥ ముదిమిచే బుద్ధి చెడత్రోవఁ ♦ బోయి, శంత
నాత్మజుం డాడ లెక్కసే ♦ యంగనైతి
నీవు నట్టుల వదరిన ♦ నీదునాల్క
చీలిక లొనర్తు చూడు నా ♦ సితకరాసి!

(అని కత్తిచూపి) మఱియు,

ఉ॥ నీవన నెంత మాకు, ధర♦ణీపతి తా వినుచుండ నోర నీ
భావము నీ నెఱుంగకయె ♦ పల్కెదు; నాకరవాలధార నిన్
జావఁగ సేయకున్న నర♦జన్మమె నాదిఁక పేదబావఁడా !

(అని పైకి దుముకును)

అశ్వత్థా—ఓరీ సూతపుత్రా, కౌరవవంశ నిర్మూల కారణా !
పోవకు మిందు, రమ్ము, నినుఁ ♦ బుచ్చెద నిప్పుడె కాలుప్రోలికిన్.

(అని యెదుర్కొనును)

(కర్ణుని దుర్యోధనుండును, అశ్వత్థామను కృపాచార్యుఁడును పట్టుకొందురు.)

దుర్యో—తగదు.

శశివదనావృత్తము:— విను మిటు మిత్రా

ద్రోణా— ... ... చనదిటు పుత్రా

కర్ణ— ... ... విన నిఁకఁ దుర్మంతున్

అశ్వ— ... ... దునిమెద వీనిన్

ద్రోణా—అయ్యో, ఏలమీరిట్లు తగవులాడెదరు. (ఒకదిక్కు జూపి) అల్లదిగో,

ఉ॥ కొండకు నుద్దియై తనరు ♦ ఘోరశరీరముఁ దాల్చి నిల్చె, వే
దండపురాధి నాథ! యమదే♦దానవరాట్కులజుండు, గండ భే

రుండ పతాకముంగల మఱి పుత్రనయుండగు భీమ సేను పు
త్రుండు ఘటోత్కచుం డనెడి దోర్బలశాలినిఁ గాంచుఁ డెల్లరున్.
చూడఁగా నాతం డియ్యెడకే వచ్చు చున్నట్టు లున్నయది.
వాని నెదుర్కొన హరిహర బ్రహ్మాదులకైనఁ దరమగునా? ఈ
కర్ణుని సాహసం బెంతయో కలదు. కాని యొకదానిఁ దెల్పెద
వినుము.

క॥ తనబలిమి, పరులబలిమియుఁ
గనుఁగొన కెవ్వాఁడు పోరఁ గడఁగునొ వాఁ డో
మనుజేంద్ర! యోటువడుగా
కని జయ మెన్నండుఁ గాంచ నగునే జగతిన్॥

పాండవుల కిప్పట్టున దండియగు శాత్రవ మండలి యండగా
నుండె. మన మిప్పుడు వారితోడఁ బోరి జయంబు వడయుట కల్ల.
అదియుంగాక,

ఆ॥ వె॥ కినుకతోడ వారు జెనకిరా నిన్నెందు?
వారితోడ నీకు వైర మేల?
పార్థివేంద్ర, సైన్యవర్గంబుతోఁ బురిఁ
దిరిగి చేర నెంచితేని వినుము॥

చ॥ పడుచుఁదనంపుబుద్ధులను బాయఁగఁ జేయుచుఁ బాండవేయులన్
దడయక చేరు టొప్పదియు తప్పనితోఁచిన నెల్లరిట్టి కా
రడవులనుండ కింక వెస హస్తిపురంబును జేరు టొప్పగున్
జెకుగులు రాకయుండఁ బురి జేరఁగ నీమది నెంచియున్నచోన్॥

మఱియు, మన యీ మర్మంబులఁ గనెనేని యాదవుఁ జేంద్రుండు
మనల మననీయఁడు. కావున వేగ వెడలుట మేలు.

కర్ణుడు—ఔరా! ఏమి మీరణశూరత! చాలు! చాలు!

ఉ॥ కూరలు నూరుబిందులును గోరసమన్నము నూరుగాయలున్
బూరెలు పూరణంబులు నపూపము లప్పడముల్ చెలంగఁగాఁ
బారణఁ జేయఁగాఁదగిన ప్రోఢులుగా కల భండనంబునన్
బోరొనరింపఁ జాలుదురె భూసురవర్యుల మే మెఱుంగమే?

మఱియు నో పిరికిబాపఁడా!

చ॥ అడగ్గ, ఘటోత్కచుండతఁడె ♦ యంచు వచించిన యంతమాత్ర నే
జడియుదునే? రణావనినిఁ ♦ జక్కడఁగింపఁగలేన ధర్మజున్?
మడియఁగఁ జేయఁజాలనొకొ ♦ మాద్రికుమారుల భీమసూను నీ
గడియను, బాండవేయు లనఁ ♦ గాఁ బడిచచ్చెదు మీర లౌనన్॥

అటులఁ జేయనైతినేని మీరెల్ల రప్పుడే నగియెదరు గాక.

ద్రోణా—రాధేయా!

చ॥ వెఱపొకయింతలేకిటులఁ ♦ బ్రేలుచునుండఁగఁ జెల్లె ధారుణీ
శ్వరుకడఁ, బాండవేయులకుఁ ♦ జాలుదె? వారికి నీకుఁ బోల్పఁగాఁ
గరిమకకాంతరంబు, మఱి ♦ గాండివి కీడగువాఁడె లేడిటన్
గురుతుగ నీకు రాక్షసున ♦ కున్ దృణమేరుసమాన మిద్ధరన్॥

మఱియు, భీముని సాహసప్రతిభ కాబకహిడింబాది నక్తంచరులే సాక్షి. ఫల్గునుని బాహుపరాక్రమంబునకు ద్రుపదరాజనిర్మిత మత్స్య యంత్రంబె సాక్షి. కావున మన మాఘనులఁ జెనకఁగలుగుదుమా? ఏల నీయోధవరులం దెల్ల ధీరుండనని మీరిన పనులకు దార జూపెదవు? కాదన్న వారలఁ గరువబోవుచు లజ్జాభయంబులు మాని నీ విట్టులఁ బల్కుచుంటివి. నీ పలుకు లీభూతలపతి విశ్వసింపుచుండెనని యిట్లాడు చుంటివి కాఁబోలు! మా మాటల నిసుమంతయైన విననైతివి. ఆ ఘటోత్కచుండె నీకు బుద్ధిఁగఱపవలెఁ గాక! మేము చెప్పిన వినియెదవా?

గీ॥ నేరనటువంటి పనులకు ♦ బారలిడుచు
బరుగువారినవాఁడు తా ♦ భంగపడఁడె?
యీఁతనేరనివాఁ డేఁట ♦ నీఁదులాడఁ
బోవ నీటను వడి మున్గి ♦ పోవకున్నె?

కాని బుడుతఁడు చెడుదారి నడుచుటఁ జూచి పెద్దవాఁ డగువాఁడు దాని వద్దనుట ధర్మము కావున;

—మత్తకోకిలలు—

నీతిమా లిటు పాండుసూనుల ♦ నీ వెదుర్పఁగఁ బోవుటల్
భీతిఁజెందక పర్వతేంద్రము ♦ బిట్టు ఢీకొన నెంచుటల్

కర్ణుఁడు — చేతగాకిటు నీతులేటికిఁ ♦ జెప్పఁజూచెదు, నీచ ! వే
నేతిముద్దలు మ్రింగుబాఁపలు ♦ నేర్తురే యని నిల్వఁగన్.

అశ్వ — ఓరిమూర్ఖుఁడ ! కూడదంచును ♦ నొప్పఁబల్కిన వారలన్
దూరనాడఁగఁ బోయెదే, మదిఁ ♦ దోఁచదయ్యెనె నీకు ఛీ !

కర్ణు — ఏమీ, చండాలా ! ఏమంటివి ? మూర్ఖుఁడనా ?
పారుఁబోత ! వడిన్ నినున్ గర♦వాలముంగొని కూల్చెదన్.

అశ్వ — ఓరీ, వ్యర్థప్రలాపా !
ధారుణింబడఁ ద్రెళ్ల నేసెదఁ ♦ దాకుమీ నను నీయెడన్.

(అని తన్నును)

కర్ణు — ఓరీ, నీచా ! ఇదిగో కాచికొమ్ము. (కత్తి సారించును.)

అశ్వ — ఓరీ, చండాలా ! సూతపుత్రా ! ఇదిగో నావ్రేటు, గాచికొమ్ము.

(అని కత్తుల నిర్వురు సారింతురు)

దుర్యో — ఆహా ! ఇది తప్పి వచ్చినది. (విడఁదీయుచు) గురునందనా! అన్నియుఁ దెలిసిన నీవిటులొనర్చుట ధర్మమా ?— రాధేయా ! ఇది యేమి ! ఏల నీవిట్లు పోరఁ దొడఁగితివి? నే నొక్కటి వక్కాణించెద వినుము.

ఉ॥ క్షితిఁ బదిమంది కూడదను ♦ చెయ్దము నేకుఁగఁగూడ దెన్నఁడున్
గుతుకము మీఱి శాత్రవులఁ ♦ గూల్చిన వీర సెబాసటండ్రె ? లే
కితరమెట్లయినచో, "నటుల♦నే యగుఁగా కవు డేమి తెల్పినన్
మతిని దలంపనందు కిది ♦ మంచి ఫలం" బని గేలిసల్పరే ?

ఈ మహాత్ముల మాటలెన్నియో గలవు. కావున నోరాధేయా! నాపలుకుల కీ వెంతమాత్రమును దొలఁగి నడువకుము. (రణము సకు దొరకొనుమని కనుసన్నఁ జేయును.) అందఱము బోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు) (తెఱపడును)

ఇది పంచమాంకము.





శ్రీ
హయగ్రీవాయ నమః

# భీమప్రతిజ్ఞ

## షష్ఠాంకము

వన ప్రదేశము.

[ధర్మజ, నకుల, సహదేవ, ఘటోత్కచ, ద్రౌపదుల ప్రవేశము.]

ధర్మ—(భేరీ నాదంబు నాలకించి) కుమారా! ఘటోత్కచా! ఆ ధ్వని యేమై యుండును? ఎందుండి వినవచ్చు చున్నది? కారణ మేదియో కన్గొని రమ్ము.

ఘటో—(దిక్కులు పరికించి) తండ్రీ! అది రణభేరీనినాదము. చూడ నిది మీర లొంటరిగ నుంటఁ దెలిసికొని,

చ॥ తెలి విదియంచు నెంచి పగదీరఁగఁ బోరొనరింప నిప్పు డా
కురుపతి సేనలెల్ల నిటకుం బర తెంచెడు సప్తసీరధుల్
బరువడి నేకమై పొరలి వచ్చెడు మాడ్కిని...

ధర్మ— ...హా కుమార! యే
దరిగల డింక? నామనము తత్తర మందుచునుండె నక్కటా!

హా! తమ్ముఁడా! భీమసేనా! వలదని పలు తెరంగులఁ బల్కినను నరకు సేయక సరసిజాక్షితోడ నడవులకు వెడలుటచే మన మెట్టి యిడుమల గుడువనయ్యె?—అయ్యో! అర్జునా! నీ విందున్న యెడ మా

కిట్టియిక్కట్టులు ప్రాప్తించవుగదా!—కుమారా! ఎంతటికార్య
మొదవె?

చ॥ ధనదునిచేతఁ జిక్కె నట ♦ తమ్ముఁడు భీముఁడు సంగరంబునన్;
మన మిటఁ జిక్కినారము కు♦మారక! కౌరవనాథుచేతిలో;
నని నెదిరించి నిల్వఁగల♦మా? తెలవెయ్యదియో? మహేంద్రనం
దనుఁ డిపు డుండినన్ మనలఁ దప్పక రక్షణసేయునేకదా॥

కాని మనకు మనమే రక్షించుకొందమన్న మనలోఁ జూచిన,

క॥ చెక్కటఁగొట్టిన క్షీరముఁ
గ్రక్కుచు నున్నట్టి నీవు ♦ కౌరవసేనన్
జక్కడఁగింపఁగ నేర్తువె?
అక్కట కవలైన నట్టి ♦ యర్భకులె సుమీ॥

భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ, కర్ణాదులన సామాన్యులరా! వారలా సురలతోడసైతము దుర మొనర్చి మెప్పొందినవారలు. మఱియు, ధార్తరాష్ట్రులును, సోమదత్తబాహ్లికులును జగద్విఖ్యాత బాహుబల పరాక్రమవంతులు. శకుని, భూరిశ్రవస్సైంధవాదులా మృగాంకవైరిని నైన మార్కొనఁ జాలుదురు. ఇట్టి బలియురతోడను, తక్కిన యోధావళితోడను మన మేరీతిఁ బోరొనరింపఁగలము? అయ్యో! ఇంకెయ్యది తెలవు? దాయఁగట్టిన గొఱియలమైతిమి గదా!

ఘటో—(మేనువిరచుచు, మీసలు వడివేయుచు) తండ్రీ! తలంచినచో వీరు నీకు లెక్కయా! వీరలకై,

శా॥ ఈమాత్రన్ దలపోయ నేల? యట నుద్వృత్తప్రతాపాఢ్యుఁడౌ
భీముం డిప్పుడె వచ్చు యుక్తతతులన్ ♦ బేరాజి నోడించి; నే
భూమిన్ గూల్చెద వీ రెదుర్కొను నెడన్; ♦ బోఁదోఁలెదన్ గానిచో
నేమీ, ఫల్గునుఁడేల? చాలనొకో, నే ♦ నీ ముప్పుఁ దప్పింపఁగన్॥

మీరావంతయు సందియం బందకుఁడు, ఈకురుబలం బన నెంత?

వీరికిఁదోడుగ నీరేడులోకంబు లేకమైవచ్చినను నే గెల్వఁజాలనా! తండ్రీ! మజ్జనకుని పతిజ్ఞ నే నెఱుంగుదుఁగాన,

క॥ పలుమాటలేల వినుఁ డీ
కలని సుయోధనునిఁ జంపకయె నే వానిన్
బలిమిన్ గట్టి భవత్పద
జలజంబులచెంత నిలుపఁజాలుదు నిపుడే.

అటుల నేఁజేయంజాలనైతినేని, నను భీమసూనుం డని పిల్వకుఁడు. ఇఁకనైన మీసందియం బుడిగి నన్నంపవేఁడెద.

ధర్మ—కుమారా! నీ పట్లనుటచే నొక్కింత ధైర్యం బూని నిన్నెంటిగఁ బంపఁ దలంపుఁగలిగె. మంచిది. మేమెల్లరము ద్రుపదరాజాత్మజఁ గాపాడుకొనుచు నీకు సహాయులమై వెనుకనుండెదము. కావున నీవు చని విజయుండవు కమ్ము.

ఘటో—తండ్రీ! నమస్కరించుచున్నాఁడ.

ధర్మ—పుత్రా! విజయోస్తు! విజయోస్తు! లెమ్ము. సత్వరమ్మున సమరమ్మున విజయలక్ష్మిం జేకొమ్ము, పొమ్ము. (యవనికపడును.)

---

(ఇరువురు గంధర్వులు ప్రవేశము.)

మొదటివాఁడు—అన్నా! ఈమహారణ్యమధ్యంబున నీ చిట చిట, పట పట ధ్వనులు మ్రోయుచున్నవే! ఎక్కడ? ఏకారణముచేత?

రెండవవాఁడు—తమ్ముఁడా! ఇప్పు డియ్యెడఁ బాండవులపైకిఁ గౌరవ సైన్యంబులు దాడివెడలి రాఁగా, భీమసేనాత్మజుండగు ఘటోత్కచుండు ధర్మరాజానుమతంబున వారలపైఁబడి ఘోరయుద్ధంబుఁ జేయఁబోవుచున్నవాఁడు.

మొదటి—అట్టులనా! అటులైన మన మటకేగి యాయుద్ధమును జూచి వత్తమా?

రెండ—చూడవచ్చునుగాని, మన సుయోధ నెక్కడు జాగ్రత్తగ నుండ వలయు. పోవ్రదము రమ్ము.

(ఇరువురు ముందుకు నడిచి)

రెండ—తమ్ముఁడా! అల్లదిగో చూడుము! అదియే రణరంగము. ఆకన్పట్టునదియే కౌరవసేన. ఈతండే ఘటోత్కచుండను రాక్షసవీరుండు, ఇప్పుడే యుద్ధమారంభమైనట్టు లున్నయది. కావున మనమిచ్చోట భద్రముగ నుండవలయు.

మొదటి—అన్నా! అసంఖ్యాకులగు నాకౌరవభటుల నీరాక్షస వీరుం డొక్కరుండు సమరంబున సమయింపఁగలఁడా?

రెండ—తమ్ముఁడా! నీ వెంత వెఱ్ఱివాఁడవు? ఆతనిశక్తి నీవెఱుఁగవు.

ఆ॥ వె॥ కురుబలంబు లెంత ♦ విరివిగా నుండిన
రాక్షసునకు సాటి ♦ రావునమ్ము
గులకరాలు గంప ♦ కొలఁదియుండిన, వన్నె
వాసి నొక్కరవకు ♦ లీసిపోవె?

కావున నీవటుల సందేహింపఁ బనిలేదు. దానినిజం బిప్పుడే కని యెదవుగాక!

("కో" యని ధ్వని వినఁబడును)

రెండ—తమ్ముఁడా! చూచితివా?

ఉ॥ సింగము క్షుద్వ్యథార్తిమెయిఁ ♦ జెచ్చెరదాటుచు నేఁగియేఁగి సా
రంగచయంబుపైఁబడి కరంబు హుటిహుటి నప్పళించు భా
తిం గడు నుగ్రుఁడై చుఁ బర ♦ తెంచెడుఁ గౌరవసేనపైకిఁ బో
రంగ ఘటోత్కచుం డనెడి ♦ రాక్షసవీరుఁడు, చూడు మాతనిన్.

ఆహా! ఏమీ! ఆఘటోత్కచుండు కౌరవసైన్యంబుల నెదుర్కొన వానిధాటకుఁ దాళఁజాలక యేలీల నాసేనలెల్లఁ బరువులిడుచున్ననో చూడుము.

("పోకుఁడు. పోకుఁడు" అని ధ్వని వినఁబడును)

కంటివా! ఆపారుబోతులు వెన్నిచ్చి పారుచున్నంత నారక్కసుండు వారి వెంటనంటి "పోకుఁడు, పోకుఁ" డనుచు వారిపై నంప వృష్టిఁ గురియించుచున్నవాఁడు—అయ్యో! పాప మా సేనలెల్ల నెట్లు చెల్లాచెదరై పోవుచున్నవో చూడుము.

("కావుము, కావుము" అని ధ్వని వినఁబడును.)

వింటివా! ఆ రాత్రించరుని ధాటి కోర్వం జాలక యా సేనలెల్ల "కావుము, కావు" మని కర్ణుఁ డున్నయెడకుఁ బరువులిడుచున్నయవి. చూడుము—అన్నన్నా! ఆఘటోత్కచుండు కర్ణునిఁగూడఁ దాఁకుటకై వాఁడున్నయెడ కరుగుచున్నవాఁడు కావున మనమును నచ్చోటికేఁగి, యాపర్యవసానము గనుఁగొనియెదము రమ్ము.

(నిష్క్రమణము) (ఇది విష్కంభము)

---

(కర్ణ ఘటోత్కచుల ప్రవేశము.)

ఘటో—ఓరీ సూతపుత్రా! శూరశిఖామణులగు మాయయ్యలపై మీర లెడతెగని పగం బూనియుండి సమయంబు దొరికినదని యొంటరిగనున్న ధర్మరాజాదులపైకి సేనాసమేతుఁడవై వచ్చితివి కాఁబోలు! ఇట్టి కృత్రిమకార్యమునకుం దగినఫలంబు నందెదవుగాక! నేనును తరుణంబు దొఱకిన కురుబలంబుల బరిమార్చి ధర్మనందను రాజ్యాధిపునిగఁ జేయింతుననియుఁ దలంచుచుంటి. అందులకు మంచి తరుణము దొఱకె రమ్ము.

మ॥ సమరంబందు నినున్ వధించి శకునిన్ ♦ జక్కాడి దుశ్శాసనున్
జము మ్రోలన్ వడినిల్పి కౌరవపతిన్ ♦ మర్దించి సైన్యంబులన్
సమయంజేసి యజాతశత్రుని నిఁకన్ ♦ క్ష్మాభర్తఁ గావింప నీ
మము నేఁబట్టితి రమ్ము రమ్మిపుడు నిన్ ♦ మార్కొందు సూతాత్మజా!

కర్ణు—ఓరీ, వ్యర్థప్రలాపీ! నాసాహసం బీ వెఱుంగవైతివి.

ఉ॥ ఓరి నిశాట నీవిటుల ♦ నుబ్బుచుఁ బల్కఁగ నేల? చూడు నా
శూరత; నింక మీరెటకుఁ ♦ జొచ్చిన నిన్వధియించి, ధర్మజున్

ధారుణిఁగూల్చి యాశవల ♦ దర్ప మడంగగఁజేసి, ద్రౌపదిన్
ధీరతఁబట్టి మాకురుప♦తిన్ గడు సంతసమందఁ జేసెదన్॥

ఘటో—ఓరీ, దంభప్రలాపీ! నీవంతటి సాహసి వగుదువా? అట్లయిన యుద్ధరంగమునకుఁ బోవుదము రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు)

(పారిపోవు కర్ణుని తరుముకొని పరుగిడుచు ఘటోత్కచుఁడు ప్రవేశించును. కర్ణుఁడు పారిపోవును)

ఘటో—(తెరలోనుండి వచ్చుచు)

శా॥ ఓరీ! పోవకు సూతపుత్ర! నిలుమీ ♦ యొక్కింత; యాతండె నీ
రారాజౌగద, పిల్వు మాతని, వడిన్ ♦ రక్షించు నిన్నిప్పు డో
ధీరమ్మన్య! సతంబు మంత్రముల బో♦ధింపంగఁజాల్ నిన్నుఁ దా
నీరీతిన్ విడనాడఁ జూచునొకొ? ధా♦త్రీశుం డదాక్షిణ్యుఁడై॥

(అని తరుముకొని తెరలోనికి పోవును.)

శకుని—(ప్రవేశించి) ఆహా! ఘటోత్కచుఁడు కర్ణుని నామావశిష్టునిఁ గావించి, మమ్ము బరిమార్చుటకుఁ గాఁబోలు నీదెసకే వచ్చుచున్నవాఁడు. దైవమా! ఏమిసేయుదు? అయ్యో!

మ॥ కనుగొంటే కురుసైన్యసంహరణదీ♦క్షాత్ముండు, దైత్యేభ్యుఁడో
జననాథాగ్రణి! సూతపుత్రకు వడిన్ ♦ జక్కాడి తా భీకరా
ననుఁడై వచ్చె; నిఁకేను నిల్వఁగలనా? ♦ నన్గాచి యానీచునిన్
దునుమాడన్ జను దేరవే కురుపతీ! ♦ దుర్వారశౌర్యోన్నతీ!

(ధ్వని వినఁబడును) అయ్యో! మిక్కిలి సమీపించుచున్నవాఁడు. అతని ముందు నేఁ నిల్వఁజాల. (అని పారిపోవుచుండ)

ఘటో—(పరువిడుచుఁ బ్రవేశించుచు)

ఉ॥ ఏల తొలంగెదో శకుని! ♦ యిట్లొనరింపఁగ నీతియౌనె, భూ
పాలుఁడు మేనయల్లుఁడు, స♦భాస్థలి నీవొనరించినట్టి యా
మేలు దలంచియైన నిను ♦ మేఁకొని పోవఁగరాఁడె? నిన్ననిన్
దూలఁగ జూచువాఁడె? ఘన♦దోర్బలుఁడే వడిఁ బిల్వు మాతనిన్॥

ఓరీ! దుష్టబుద్ధీ! నీశక్తిసామర్థ్యంబులఁ జూపుటకు,

సీ॥ వలనొప్ప ఘోరాహ♦వస్థలియాగాని
ఛలములాడెడు ద్యూత♦శాలగాదు
ఖ్యాతికెక్కు సం♦గరఖేలనముగాని
తాతయ్య! మాయజూ♦దంబుగాదు
పొలుపొంద ఘనశరం♦బులుగాని, నీవను
గతిఁ బడ నివి పాచి♦కలునుగావు
నలువొంద దానవ♦నాయకుల్ గాని మా
యలు బన్నఁగాఁ బాండ♦వులునుగారు

గీ॥ ఔర! యీరీతి వెన్నిచ్చి ♦ పారమేర
యౌనె, పోవకు పోవకు ♦ మయ్యెయొందు
పరుగువారిన నిను భంగ♦పఱుప కింక
విడుతునని యెంచఁబోకు మెన్నఁడు దురాత్మ!

(తరుముకొనిపోయి, తిరిగి ప్రవేశించి దుర్యోధను నుద్దేశించి, కోపముతో) ఓరీ! సుయోధనా! దురాత్మా! కౌరవకులజలధి బడబానలా! ఇంక నీవ చిక్కితివి. దూరమ్మున నిల్చెదవేల? రమ్మల్లదిగో! చూడుము. మీవారల యవస్థలఁ గన్గొనుము.

క॥ వీరలె నీతమ్ములు, మఱి
వీరలె నీమామ, శకుని, ♦ ప్రియుఁడగు కర్ణుం,
డారయ వీరెల్లరు జను
వారికిఁ జననున్నవారు ♦ పార్థివచంద్రా!

వీరు నీకుఁ బరమాప్తులు కారా? ఇప్పుడే నీపరాక్రమముఁ జూపి వీరల విడిపించుకొని పోయెదవు రమ్ము—కదలవేమి?

గీ॥ అలిగి వీరల మర్దించు ♦ నపుడుగాక
సమయమెయ్యది నీపరా♦క్రమముఁ జూప?
నిచటి కేతెంచి తెందుల ♦ కిప్పు డిట్టు
లలుక మంత్రైనఁబూనక ♦ నిలుచుటేమి?

పాప మా దురాత్ములు కర్ణ శకును లీల్గిరే! దుర్యోధనా! నీ కింక దుర్యోచనలఁ గఱపువా రెవ్వరు? ఇట్టి చెలికాండ్రు నెడబాసి యీవసుధ నెట్లేలెదవు? ఇంకెట్లు మనియెదవు? —

క॥ మును పాండవులను మాయల
వనువొందఁగ గెలిచి తనుచు ♦ ననయము విందుర్
జనవర! యిపు డటు నలుపర్
జను నే? శరమునన గెలిచి ♦ చనవలె సుమ్మా॥

నీదుర్మార్గముల నే నెఱుంగ నని తలంచితివి కాఁబోలు. ఆహా! అట్టి నీ కిప్పు డట్టి శాంతగుణంబు నావలనం గలిగె. ఓరోరీ!

చ॥ ధరణిప! యుద్ధమందు ననుఁ ♦ దాఁకెద నంచు మదిన్ దలంచినన్
గరిపురిపైని నాస విడి ♦ గ్రక్కున రమ్ము...
(తెరలోనికి పరుగునఁ బోవుచు) ...సుయోధనావడిన్
బరువిడ నేల? జూదమున ♦ బాండుతనూజులఁ గెల్చినట్టి ని
న్నరయఁగలాఁడె ధాత్రి నొకఁ ♦ డైన? బలాఢ్యుఁడ! పోకుపోకుమీ!

(తిరిగి ప్రవేశించి)

ఆహా! అయ్యది తరువా? దాని నాదుర్యోధనుం డని భ్రమచెంది వచించుచుంటినే. ఐననేమి, ఇప్పుడే వానికై ...యెదఁగాక!

(నిష్క్రమణము)

---

(ద్రోణ, దుర్యోధనుల ప్రవేశము)

ద్రోణుఁడు—(ఆలకించి తలయూచి) కౌరవరాజేంద్రా! ఆగాత్రించరుం డాఁడెడు పరుషోక్తుల వినుచుంటివా! అతఁ డొకశరపుంగవుని, నీ వని భ్రమచెంది యట్లాడుచున్నవాఁడు. నిజముగ నిన్నే కనొన్న నేమి సేయునో కదా? ఆహా! అతఁడుగూడ నియ్యెడకే పరువిడి వచ్చుచున్నవాఁడు. ఇంకేల మన విక్రపెగ్గలు?

చ॥ మనుజపతీంద్ర! నీయనుఁగు • మామయవస్థను జూచి వాఁడ వా
దనుజుని భీషణాస్త్రతతి • ఘాటిమ్ముఁ గంటివి; వాని నన్నఁగా
జనుని ధరిత్రి నెవ్వఁడికి? • సాగఁగ నేర్చునె సాహసంబు లిం
కను మది భీరముఁ విడిచి • కౌరవకోటికి రక్ష సేయుమీ॥

అది యెట్లంటేని, నీవిప్పట్టున నా రక్కసునితోడఁ జెలిమిం జేయుటయె. అదిగాక వేఱొక తెఱవు గన్పట్టదు. ఇది ముమ్మాటికి సత్యము. నీవిటు లొనర్చవేని, కరిపురిపై నాన నేటితో సరియని యెఱుంగుము. వీని సామాన్యనక్తంచరుండని తలంచితివి కాఁబోలు! ఈతం డాదశకంఠు నంతటి మేటిసుమీ!

దుర్యో—(తల పంకించి, వంచి, తనలో) ఆహా! ఇంకెయ్యది తెఱవు? వీరిట్లు పుల్లవిరుపుమాట లాడుచున్నారే. ఇంక కర్తవ్యమేమి? పుత్ర, భ్రాతృ, సుహృ, ద్బాంధవులెల్లరు నీరాత్రించరుచే ధాత్రిఁ గూలిరి. కావున, నిప్పట్టున విదివచనానుసరణి నా యసురునితో నేస్తమొనర్చుటయే ప్రశస్తమనితోఁచెడిని. కాని వీని నెట్టులఁ బల్కరింతు? కోపానలజ్వాలలఁ బర్వఁజేయుచు వచ్చుచున్నాఁడే! వీని నెవ్విధిఁ బ్రసన్నునిం జేయఁజాలుదు? (ఆలోచించి) సరిసరి. ఇప్పుడొక యుక్తి తోఁచినది. అదిగో! రాక్షసుఁడు సమీపించుచున్నవాఁడు. ఎదురుగాఁ బోయెదగాక!

ఘటో—(ప్రవేశించుచు) దుర్యోధనా!

ఉ॥ మించిన వేడ్కఁ బాండవుల • మేదిని గూల్చెదనంచు నాత్మ నూ
హించి వనాంతరస్థలి క • హీనపరాక్రమమొప్ప వచ్చి, వే
కాంచితె కర్ణునిన్ శకునిఁ • గాలునిఁ బ్రోలున కేగనుండ, నో
వంచక! వారి వీడి చనఁ • బాడియె, పోయెద రమ్ము వారితోన్.

ఓరీ! చిక్కితివా! నీవింకెందు బోయెదవు?

దుర్యో—(ఎదురుగా బిరబిరఁ జని కౌఁగలించుకొని) కుమారా! భీమనందనా! నీకిది న్యాయమా? నా సోదరులగు పాండవులపాటు

విని, సైన్యసమేతుండనై వారలకు సాయపడఁ జనుదెంచు నాపైనా నీ సాహసము? కురుపాండవుల కొకభేద మున్నదా? మేమెల్లర మొక్కటియే గదా! పగతునివలె నీవిట్లొనర్పఁదగునా? శాంతింపుము. నా వచనముల నాలకింపుము.

వనచరులేరైన నీ వనమ్మున మమ్మడ్డగింతురేమో యను తలంపున స్వసంరక్షణార్థము మేము రణభేరి మ్రోయించితిమి. అయ్యది విని నీవు మమ్ముల శత్రులఁగా నెంచి మాపై దాడివెడలితివిఁ అంత నేను నిన్నుఁగని "తెలియని కతంబున నీ విట్లు వచ్చుచున్నాఁడ"వని యెఱింగియు నా సైన్యంబుల మరల్పనైతి. అందులకు కారణం బొండుకలదు. అది యెద్దియన, "మీర లేకతమ్మున మా బోంట్ల సహాయంబునైనం గోరక, ధనదునిపైకి వెడలుచుంటఁ గని, మీరలు వారల సమరమ్మున నెదిరింపఁ గల్గుదురా, అంతటి శర కౌశలంబు గలదా?" యని సందియంబొదవి, "కానిమ్ము చూతము. ఇంటఁ గెల్చి రచ్చఁ గెల్వుమన్నటుల మనతోఁ బోరి నిల్వఁగల్గినఁ గదా నాయకుల నెదిరింపఁ జాలుట?" యని యూహించి నే నట్లొనర్చితి. ఇప్పుడు నా సందియంబు దీరె.

గీ॥ శౌర, కంటిని కంటి, కుమార! నీదు
బాహుబల మెల్ల; నేత్రపర్వంబుఁ గంటి;
దివ్యశస్త్రాస్త్ర మహిమంబుఁ దెలిసికొంటి;
భీమనందన! సంగ్రామభీమ! నేఁడు.

నిక్కముగ నీ వొక్కరుండవే యాయక్షులఁ బొలియింపఁజాలుదువు. కుమారా! శాంతింపుము. ఈ కల్లోలంబంతయుఁ గల్లయని భావింపుము.

ఘటో— (ఆశ్చర్యముతో) దుర్యోధనా! ఇదియేమి! అందిన జుట్టును అందని కాళ్లను బట్టువానివలె నున్నాఁడవే! అన్నా! నిన్ను నమ్మఁజాల. (అని దుర్యోధనుని రెక్కల విరిచికట్టును.)

దుర్యో — కుమారా! రాత్రించకేండ్రి! అట్టి సందేహంబు లుడుగుము. నా వచనమ్ములు సత్యములని యెఱుంగుము. ఇంక మన మిట నేల యాలసింపవలయు? భీమసేనునికిం దోడుపడ వేగమ పోవుదము రమ్ము. మున్ముందు మాయన్న యగు యుధిష్ఠిరు సముఖమ్మున కఱిగెదము గాక! (అని యిరువురు నిష్క్రమింతురు)

ద్రోణా—ఆహా! ఏమి వీని యుక్తి? ఇప్పుడుగదా సుయోధననామము సార్థకమయ్యె. కర్ణ శకునిప్రముఖుల సేద దేర్చి వారినిఁ గూడఁ దీసికొని పోయెదగాక! (నిష్క్రమించును)

---

(కర్ణాశ్వత్థామ ద్రోణాదుల ప్రవేశము)

ద్రోణా—మీర లిటురండు. (కర్ణాశ్వత్థామలఁ బిలుచును)

అశ్వ—రాధేయా! మజ్జనకుండు పాండవులతోఁ బోరొనర్పఁ దలంపవలదనియు, నటులఁ దలంచినఁ గీడు మూడుననియుఁ, బలు తెఱంగులఁ జిలుకకుఁ జెప్పినటులఁ జెప్పినను నావంతయు సఱకు సేయక,

“ఉ॥ పాండవులన్న నెంత? యదు ♦ పాంసనుఁ డుండిన నెంత నాకు? భూ
మండలిలోన నన్నెదిరి ♦ మార్కొనఁ జాలిన వీరుఁ డున్నె? సీ,
ఖండనమందు నిల్చినను ♦ పాండుసుతుల్ పడు పాట్లుచూడు, వే
దండపురాధినాథుదరిఁ ♦ దత్తరమొందుచుఁ బల్కనయ్యెనే?”

అని ప్రగల్భములాడిన నీ విప్పు డిట్టుల తలపోసికొనియెద వేమి?—ముందు వెనుక లారయక,

ఉ॥ మాటలు పెక్కు నేర్చితని ♦ మనుష్యుల నోట వచింపరానటుల్
మాటికి మాటికిన్ వదర ♦ మాన్యత గల్గెనె; మద్వచస్సు తా
టోటని యెంచి తప్పుకు; ఘటోత్కచసాహస మిప్పుడైన నీ
పాటిపడంచుఁ గాంచితివె? ♦ స్వానుభవంబున సూతపుత్త్రకా!

ఔరా! “తడిసిగాని గుడిసె గట్టడు, తగ్గిగాని మొగ్గ”డను లోకోక్తి రిత్తయగునా? ఎవ్వండేని తన్ను మించి చరించువాఁడు పరిభవం

బందకుండునా? పాపము! నీ కెట్టి గర్వభంగము సంప్రాప్తించె! ఏలనీ పేలీలఁ దలపోసికొనియెదవు? గతజలసేతుబంధన మేల? ఇఁక నైన బుద్ధిగలిగి నలువురతోఁబాటు నీవును నడువుము.

కర్ణు—(తనలో) ఆహా! వీఁడు నా శరీరము చిరుగులువడ కటకట మ్ములఁ బోలు పలుకులాడుచుండెనే? ఏమి నా బ్రదుకు?

(అందరు నిష్క్రమింతురు.)

---

(ధర్మజ. నకుల, సహదేవ, ద్రౌపదులును, ఘటోత్కచుండును, ద్రోణ, కర్ణా, శ్వత్థామ, కృపాచార్య, శకుని దుర్యోధనాదులును ప్రవేశము.)

(శంఖధ్వని వినఁబడును)

సహ—(ద్రోణునితో) వింటిరా, ఆశంఖానినాదము. అల్లదిగో! దుర్వార శౌర్య గర్వితారి మదేభకంఠీరవుంకును, భీమబలాఢ్యుం డునునగు భీమసేనుండు

గీ॥ వసుధ తల్లడమందంగఁ ♦ బాపఁజేఁడు
కదలఁ, దారలు డుల్ల, దిక్♦తటము లదర
నాది కూర్మంబు మదిచెడి ♦ యదర, నదిగో
శంఖనినదంబు సేయు నిశ్శంక నిపుడు.

కావున నిపుడే కదనంబునకుఁ గడగుచుండనోవు! సత్వరముస నరిగెదము గాక!

(అందరు ముందుకు నడతురు)

ధర్మ—గురువర్యా! మనమిపుడు కదనరంగము సమీపించినారము. (ఒక దిక్కుజూపి) ఆచార్యా! అల్లదిగో! దూరంబున మనవైపు నకు నాతురతతోఁబఱతెంచు పురుషుం డెవ్వండై యుండనోవు?

ద్రోణా—ధర్మనందనా! ఆతండు భవత్సహోదరుం డగు నర్జునుఁ డుగఁ గన్పట్టు చున్నవాఁడు.

ధర్మ—(వికసితవదనుండై) నాకును నట్లులనే తోఁచెడిని.

అర్జు—(ప్రవేశించి) అగ్రజా! నమస్కరించుచున్నాఁడ.

ధర్మ—ఆయుష్మాన్ భవ!

అర్జు—(ద్రోణునిఁగని) గురువర్యా! భవచ్ఛిష్యుఁ డిదే మ్రొక్కు-
చున్నవాఁడు. (పాదములకు మ్రొక్కును.)

ద్రోణా—దిగ్విజయోస్తు! లెమ్ము. (లేవదీయును.)

ధర్మ—తమ్ముఁడా!

క॥ కవ్వడి! యియ్యెడ దుర మని
యెవ్వనిచేఁ దెలిసికొంటి ♦ వింద్రుని సభలోన్;

అర్జు— ఎవ్వండగు? నారదుఁడే
నవ్వడి యెరిగించె నాకు ♦ సాకల్యముగన్.

ధర్మ—ఆహా! నారదమౌనీంద్రుఁడు కడు వందనీయుండు. సరియుకాని యింకఁ గర్తవ్యమేమి? ఈ దిక్కునం జని మనసోదరునిం గలిసి కొందము రండు. (అందరు నిష్క్రమింతురు.)



(భీమ, నలకూబర, మణిభూషణుల ప్రవేశము.)

నల—ఓరీ, నరనాథాధమా!

ఉ॥ చోరుని భంగి మానసరసిఁ ♦ జొచ్చి, భయం బినుమంతలేక, త
న్నీరజముల్ గ్రహింపఁదగు♦నే? దురితాత్మక! యోవిహీన! నీ
తీరునుఁగాంచి కూడదని ♦ తెల్పిన మావనపాలకావళిన్
గ్రూరతఁ ద్రుంచివైచితివి? ♦ క్రూళ! నినున్ మననీయ నాయమే?

భీము—ఓరీ, తులువా!

గీ॥ తులువతనమున నీవాడు ♦ పలుకులకును
దగిన ప్రతిఫలమందెదో ♦ పొగరుబోత!
యీసరసిఁ జొచ్చి, పుష్పముల్ ♦ గోసికొనుట
చౌర్యమే? యట్లు దలపంగ ♦ సరియె నీకు?

నల—ఓరీ, బాలిశా!

గీ॥ మాసరసిఁ జొచ్చి పుష్పముల్ ♦ గోసికొనుట
చౌర్యమేకాదె ? నీవెంత♦సాహసివొకొ ?
పరులసొత్తుల్ల ననుమతి ♦ వడయ కెపుడుఁ
గొనుట చౌర్యంబుగాదె రెూ ♦ క్రూరకర్మ !

భీము—ఏమేమీ! ఆకొలను మీయదియా? అందలి సరసీరుహం
బులఁగొనుట చౌర్యమా? చాలు! చాలు!

శా॥ ఈతీ రెందు వచింపఁజోకు మధమా! ♦ యీపర్వత వ్రాత సం
జాతంబై చను నిర్ఝరీజనిత కా♦సారంబు నీ దంచు ని
ర్భీతిం బల్కెదె దుష్టచిత్త! యది నీ ♦ విత్తంబునం గొంటె? నీ
తాతల్ దాని రచించినారె? యితరుల్ ♦ దాకంగ రాకుంటకున్॥

ఆసరసిపై నీకెట్టిస్వాతంత్ర్యముకలదో యితరులమగు మాకును
నట్టి స్వాతంత్ర్యమేకలదు. ప్రకృతినిర్మాణముల కందఱు సమాన
స్వతంత్రులేకదా? కావున నీ వింక జంకుమాని దొంగతన మనఁ
గడంగితివేని నీ కెక్కు డింక దక్కదని యెఱుంగుము.

నల—చాలుచాలు—

మణి—అహా! ఈతఁడు గొప్పశాస్త్రజ్ఞుని తెఱంగునం గన్పట్టుచున్న
వాఁడు. దీనింబట్టిచూడ "నాకంటపడినదిగాన నది నాయది"
యను నూతనధర్మం బాచరణలోనికిం దెచ్చు సచ్చరిత్రునిభంగి
నున్నవాఁడు.

నల—మానవాధమా! మావనముం బ్రవేశించి, యందలిచిత్రంబుల
నేత్రపర్వంబుగఁగాంచి, వచ్చినతోవంబోవక, తన్మధ్యస్థకాసారం
బుంజొచ్చి, కలంచి; యందలి కమలంబులఁగొనుచుండ, నీ కది తగ
దనియనఁ, గొలంకే నాయది యనగడంగితివా? ఎంత మదోన్మత్తత
నున్నాఁడవు? చాలుచాలు. తుచ్ఛుఁడా! ఇట్టి పిచ్చిప్రేలుడు లికఁ
గట్టిపెట్టి యిచ్చోటువీడి, తక్షణంబ చనకుంటివేని, నీప్రాణాబులు
నీ కింకఁ దక్కవని యెఱుంగుము.

భీమ—యక్షాధమా !

క॥ మ్రుక్కడి! యేమంటివి? నీ
జక్కులబలములను కలని • జక్కాడిన నా
యుక్కు నెఱుంగవు; మఱి నీ
పెక్కుడు బల్లిదుఁడవో కొ • య్యెల్లరకంటెన్ !

నల—ఓరీ దంభప్రలాపీ!

ఉ॥ వేదురుఁబట్టిన ట్లిటులఁ • బేర్చిలిన నాగదతోడ నిన్నిదే
మోది, ఖరార్కసూనుపుర • మున్ వడిఁ జేర్చెద, దుర్మదాంధ!

భీమ—యక్షాధమ! నీగదన్ దుత్రిని • జక్కుగఁ జేసి, నినున్ వధింపగాఁ
బోదమటంచు నాగద ప్ర • మోదముఁ జెందెడు రమ్మురమ్మికన్॥
ఓరీ పారుబోతా! పోరికిఁ దారసిలుము. నీకండకావర మడంచు వాఁడ రమ్ము.

నల—ఇదిగో! వచ్చితి. కాచికొమ్ము.

మణి—(నలకూబరుని కడ్డమువచ్చి) మహారాజా! ఈసామాన్య నరాధమునితోఁ బోర నేఁజాలనా? ఒక్కత్రుటికాలంబున నిర్జించి వచ్చువాఁడ. చూడుము నా రణప్రావీణ్యము.

నల—మంచిది పొమ్ము.

మణి—ఓరీ! నరుఁడా. నన్నుంగెలిచి తరువాత మా మహారాజుపైకిఁ బొమ్ము. (తనలో) ఏమీ! ఈనరుఁడు సామాన్యునివలెఁ గన్పట్టఁడయ్యె. ఇట్టి భీమబలాఢ్యునితోఁ బోరి నే జయమందఁగలనా? వట్టి మాట. ఒకవేళ నే జయమందితినిపో, నాకుసర్వసైన్యాధిపత్యపదవి తప్పక సిద్ధించును. అందులకు సందియంబులేదు. కాక, నేనోటు వడినను మా మహారాజున కొకవిధమున సాయముఁ జేసినవాఁడనే యగుదును. అ దెట్లంటేని నాతోఁ బోరుసల్పుటచే నీనరుం డలసటఁ జెందకమానఁడు. అప్పు డీతని మామహారాజు గెల్చుట మిక్కిలి సులభము. (ప్రకాశముగా) నరుఁడా! సిద్ధముగ నుంటివా?

భీము——మంచిది రమ్ము. (ఇరువురును కత్తులతో యుద్ధమొనర్తురు)

నార——(ప్రవేశించి, దూరమున నిల్చి తనలో) వహా వా! నాకెట్టి విందులపై విందులు జరుగుచున్నవి? నిన్న ఘటోత్కచునకును గౌరవులకును జరిగిన ఘోరసంగ్రామంబున నాకొక గొప్పవిందు జరిగినది. ఇప్పుడిదియ్యెడ నింకొకటిగూడ సమకూడనున్నయది. కావున నిప్పుడె చని కాల్యకృత్యంబుల నిర్వర్తించుకొని కృతస్నాతుండనై వచ్చి విందారగించెదఁగాక. (నిష్క్రమించును)

భీముడు——(మణిభూషణునితో) ఓరీ! యీతూరి నీయసువులఁ బాసెదవు చూడుము.

(గదాయుద్ధము చేయును, మణిభూషణుఁడు పడిపోవును)

భీముఁడు——(నలకూబరునితో) ఓరీ! యక్షాధమా! ఇంక జాగుచేదవేల? నీవ చిక్కితివి రమ్ము.

నలకూ——ఓరీ, నీచమానవా! నీవేల యకారణంబుగ దురంబునకు దొరకొని ప్రాణంబులఁ బాపుకొనదవు? మననెంచితివేని తప్పు జేసితినని యొప్పుకొనుము. నీకభయదానంబొసఁగి, నిన్నుమన్నించి పోనిచ్చువాఁడ. కాదేని,

మా॥ ఘోరతరంబగు మార్గణముల్ గొని♦కూలఁగ నేసెద జూడుమునిన్

భీముడు——అట్టులనా! చాలు చాలు.

మేరుసమాన బలాఢ్యుల నెందర ♦ మేదినిఁ గూల్చితి దానవులన్
వారలకంటె భుజాబల విక్రమ♦వంతుఁడవే నను మార్కొనఁగా
నోరి, ప్రగల్భము లాడఁగఁబోకుమ♦దుగ్రగదాహతిఁద్రుంచెదనిన్.

నల——భూరిపరాక్రమవంతులని నన్నిటు♦బొల్చెదె నీచనిశాటులతోన్
వారలగెల్చితినంచు ననున్ గెలు♦వన్ గలవే? తులువా! కలనిన్

భీము——వారలగెల్చుటకంటె నినున్ గెలు♦వన్ సులభంబునుమా కనుమా
ధీరుఁడనంచుమదింగొనుగర్వము♦ద్రెంచెద, ద్రుంచెద, ద్రుంచెదనిన్॥

(అని యిరువురు గదలఁద్రిప్పుచు యుద్ధముచేయుదురు)

నార—(ప్రవేశించి, దూరమున నిల్చి, తనలో) ఆహాహా! ఏమివిందు లేమివిందులు! సౌగంధికపుష్పాధారంబున నాటిన కలహాంకురు మొలక పెరిగి పెద్దదై యిప్పటికి రెండు పంటలుపండి, నాకడుపు నిండించి నాకు సంపూర్ణముగఁ దృప్తినొందించినది. చాలును. ఇప్ప టికే పొట్ట యుబ్బిపోయినది. ఇంక దురాశకుఁ బోయితినా, గణపతి కడుపువడువున విచ్చిపోవును. కావున నింక కలహంబు సమయింపఁ జేయఁ జూచెదగాక. (నిష్క్రమించును.)

బ్రహ్మ—(ప్రవేశించి తనలో) ఈ ఘోరసంగ్రామంబుఁజూడ నింత టితోఁ దుదముట్టునట్లు గన్పట్టదు. దీని నిట్టులనే విడిచిపుచ్చితినేని నారదుండు సెప్పినట్లు, క్రమక్రమంబుగఁ బాండవ పక్షపాతియగు కమలాక్షునకును, కుబేర పక్షపాతియగునలాక్షునకును గయ్యంబు పొసంగకమానదు. ఈశివకేశవులకుఁ బోరు దారసిలిన లోకంబు లెల్లఁజీకాకు నొందు. కావున నిప్పుడే వీరి సమాధానపరుపవలయు— (పరుగున వారలమధ్యకు వచ్చి) వాయునందనా! శాంతింపుము. శాంతింపుము. కుబేరకుమారా! యేమియీ తెలియనితనము? ఒక్క నీ రజంబుకై మీ రీతీరునఁబోర మేరయగునా? నలకూబరా! ఈతండు సామాన్యనరుఁడని తలంచితివి కాఁబోలు. ఈతం డత్యనిలతన యుండు సుమా! మఱియు 'నీకాప్తకోటిలోని వాఁడును నగు; నెట్లంటేని,

గీ॥ తొల్లి శంభుండు శాంబరీ♦భిల్లుఁడగుచు  
సూకరనెపంబునను వీని ♦ సోదరుఁడగు  
ఫల్గునునితోడఁబోరి, యు ♦ వ్వానిపటిమ  
కలరి, పాశుపతం బిడి ♦ చెలిమిఁజేసె॥

(ధర్మరాజాదుల ప్రవేశము)

ధర్మజ—గంగానందన! రణరంగమునకు వచ్చినాము ఆశ్చర్య ముతో) ఏమది! పోరుచల్లారినట్లున్నదే! ఆకన్పటు నలుమోములవాఁ డెవ్వండై యుండు? కమలగర్భుండు కాఁడుగదా?

భీష్మా—ధర్మనందనా! సందేహమేమి! విరించిదేవుడుమా! భీమనల కూబరుల సమాధానపరుప వచ్చినట్లున్నయది. మనమును జని వనజ భవుని దర్శించి జన్మసాఫల్యత నొందుదము. తొందరగ రండు.

అందరు—(చతుర్ముఖునిఁ జేరి) సరస్వతీ కళత్రా! నమస్కృతు లొనర్చుచున్నారము.

(అనిపాదములకు మ్రొక్కులిడుదురు)

బ్రహ్మ—కళ్యాణ్! కళ్యాణ్!

ధర్మజ—తమ్మిచూలీ! భవద్దర్శనసుకృతమ్మున మాదృశ పతితజన మ్ముల జన్మములు కిల్బిషహరమ్ములై, పావనతరమ్ములయ్యె.

బ్రహ్మ—మంచిది. (నలకూబరునిఁజూచి) నలకూబరా! హేమసుమ మ్ముల నీభీమసేనునకొసంగి వాని సంతృప్తుంజేయుము. మఱియు నీధర్మరాజాదులకును స్వాగతం బొసంగుము.

నలకూ—చిత్తము, (లోనికేగి పూవులఁగొనివచ్చి) అనిలనందనా!

ఉ॥ రమ్ము ప్రభంజనాత్మజ! కరమ్ము మనమ్మునఁ గ్రమ్మనిమ్ము నే స్తమ్ము; దురమ్మునందలి విరోధమ్మును నీస్మరణమ్మునుండి పోఁ జిమ్ముము మిమ్ముఁ గంజభవుఁ డెన్నలరారగ నేఁడు జూచు భా గ్యమ్ము; నొసంగినట్టి కనకాబ్జము లియ్యవె కొమ్ము సమ్మతిన్॥

భీముఁడు—(అందుకొని) యక్షాధినాథా! భవాదృశ పుణ్యసత్తముల తోడ నేస్తమ్ము సంప్రాప్తమ్మగుడు గడు ముదమ్మునఁ జెందితి. మిత్రుని గ ననుఁగన్గొనినందులకు మీకు నాయనేకాభివందనములు.

నలకూ—ధర్మనందనా! గాంగేయాది మహాయోధవరులారా! యీసా రసీరుహాసనమ్మున మిమ్మందర సందర్శింపఁ గల్గినందులకుఁ గడు సంతసిల్లుచున్నాఁడ. మీకందర కిదే నాస్వాగతము.

ధర్మ—(భక్తిపూర్వకముగ) బ్రహ్మనందభరితుల మైతిమి.

భీము—(ధర్మజుని యొద్దికేగి) అగ్రజా!

క॥ మన్నింపుఁడు దురితాత్ముఁడ
నన్నౌ! ననుఁగా; ముందు వెనుక • లారయక యె, యీ
రెన్ని తెఱంగులఁ దెలిపిన
నన్నియు వినకట్టిఫలము • నందితి ననఘా॥

(పాదాక్రాంతుఁడగును)

ధర్మ—(లేవనెత్తి) సోదరా! ఇదియంతయు దైవయోగము. దానికె వ్వరేమి సేయఁగలరు? "బుద్ధిః కర్మానుసారిణీ" యను నార్యోక్తి నెఱుంగవా?

భీము—(ఆతురతతో) పాంచాలరాజనందనీ! యిటురమ్ము. (ముందుక కలాగిన్న ని, పుష్పములఁదీసి)

ఉ॥ అంగన! నీవు నేను వన • మందు విహారసుఖాబ్ధి మున్గుచో
రంగు గ నీకొసంగిన వ•రంబున క త్తటి నింగినుండి మేల్
బంగరుపుష్పమొండు ధర •పైఁబడ, నంది, ముదంబుఁజెంది, క
న్నుంగవ కద్ది, తెమ్మని న•నుఁగా దగఁగోరవె యట్టికోర్కెనల్.

ఉ॥ నీరజనేత్రి! యెవ్వి నను • నీవడుగకా, రఘురామపాదపం
కేరుహభృంగమైతనరు • కేసరిపుత్రుఁ, గుబేరసూను, వా
ణీరమణీమనోహరుని • నెమ్మిఁ గనుంగొను భాగ్యరాశిఁ జే
కూరిచె, నట్టి తమ్ము లివె • కొమ్ము మనమ్ముల రారఁ గొమ్మరో॥

(అని పూవుల నిచ్చును.)

ద్రౌప—(తలవంచుకొని యందుకొనును.)

బ్రహ్మ—ద్రుపదరాజనందనీ! నీ వింకెద్దియైనఁ గోరుము.

ద్రౌప—వాణీప్రాణధవా! తమ కరుణాకటాక్షవీక్షణముదక్క యితర మే నొల్ల.

సహ—(ముందునకువచ్చి) కమలసంభవా! అట్లైన నీ భరతవాక్య మగుఁగాక!

గీ॥ వర్షముల్ కుంభవృష్టిగ ♦ వరలుగాక
ధాత్రి సస్యసమృద్ధయై ♦ తనరుగాక
జగతిజనములు సుఖులయి ♦ నెగడుగాక
ప్రభువు లన్యోన్యమైత్రిని ♦ బఱఁగుగాక॥

బ్రహ్మ—తథాస్తు! తథాస్తు!



గద్య—ఇది శ్రీరమారమణ కరుణారసప్రసాదిత ప్రాప్తకవిత్వ, హారిత
సగోత్రపవిత్ర, శ్రీమత్కర్లపాలెము వంశపయఃపారావార రాకా
కైరవమిత్ర, కామయామాత్యపుత్ర, సుకవిజన విధేయ
కోదండరామ నామధేయ ప్రణీతంబయిన
భీమప్రతిజ్ఞ యను నాటకము
సర్వము సంపూర్ణము.

మంగళమ్ మహత్ శ్రీశ్రీశ్రీ



# ప్రకటన



ఈ గ్రంథకర్తచే రచియింపఁబడిన యితర గ్రంథములు.

1. <u>కవిత్వతత్త్వము</u>. ఛందస్సు. గురువులేకయే దీనినిఁ జదివినచోఁ కవిత్వముఁజెప్ప శక్తి కలుగును. వెల రు 0-8-0.

2. <u>కాంత</u>. స్త్రీలకు నీతుల గరపు పద్యకావ్యము. 9 వ ముద్రణము. పార్లమెంటు టెక్స్టు బుక్కు కమిటీవారిచే బాలికా పాఠశాలలకుఁ బఠన గ్రంథముగ నంగీకరింపబడినది.
వెల రు 0-3-0

3. <u>శివరాత్రి చరిత్ర</u>. శివలింగోద్భవకథ. శివభక్తుల కత్యంతోపయుక్తము. వెల రు 0-0-6.

వలయువారీ క్రింది అడ్రసుకు వ్రాయుడు:—

కర్లపాలెము కోదండరామయ్యగారు,
మేనేజరు, ఆంధ్రగ్రంథాలయ ప్రెస్,
బెజవాడ.



# సవరణల పట్టిక.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 8 | వడువునె | వడువుననె |
| 18 | 20 | కనులందువు | కనులపందువు |
| 30 | 7 | ఝా భీమసేను | యా భీమసేను |
| 54 | 15 | ఢేమి? | లేమి? |
| 55 | 18 | నాకాసారముం | యాకాసారముం |
| 68 | 18 | సత్త | సప్త |
| 69 | 14 | జగదిఖ్యాత | జగద్విఖ్యాత |
| ,, | 24 | గూర్చెది | గూర్చెద |
| 70 | 2 | పతి్రన | ప్రతిన |
| ,, | 20 | ఘటో్కచు | ఘటోత్కచు |
| 71 | 20 | హుటిహుటి | హుటాహుటి |
| ,, | 25 | చున్ననో | చున్నవో |
| 75 | 16 | భ్రమచెంది | భ్రమజెంది |
| ,, | 21 | పరుషోత్తుల | పరుషోక్తుల |
| ,, | 22 | కనొన్న | కన్గొన్న |
| 76 | 18 | విరి | వీరి |
| ,, | 28 | వంచిక | వంచక |
| 78 | 28 | పాటిదడంచు | పాటిదటంచు |
| 83 | 8 | నిన్న | నిన్న నే |
| ,, | 21 | ప్రగల్ఖము | ప్రగల్భము |
| 84 | 25 | ఆశ్చర్య | (ఆశ్చర్య |
| ,, | 26 | ఆకన్పటు | ఆకన్పట్టు |

## ఆంధ్రనాటకములు.

| | | |
|---|---|---|
| బభ్రువాహన విజయం | 1 | 0 |
| శ్రీరామజననము | 1 | 0 |
| సీతాకల్యాణము | 1 | 0 |
| పాదుకా పట్టాభిషేకం | 1 | 4 |
| లంకాదహనం | 1 | 0 |
| కుశలవ | 1 | 0 |
| మైసూరు రాజ్యము | 1 | 0 |
| కాళిదాసు | 1 | 0 |
| చంద్రగిరాభ్యుదయం | 1 | 0 |

పానుగంటి లక్ష్మీనరసింహారావు గారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| పాదుకా పట్టాభిషేకం | 1 | 4 |
| కంఠాభరణము (హాస్యం) | 1 | 0 |
| రాధాకృష్ణ (భక్తిరసం) | 0 | 12 |
| పూర్ణిమ (భయానకము) | 1 | 0 |
| వీరవతి (క్రొత్తనాటకం) | 1 | 4 |
| ముద్రిక (అద్భుతరసం) | 0 | 12 |
| నర్మదా పురుకుత్సీయం | 0 | 12 |
| సరస్వతి | 1 | 4 |

కందుకూరి వీరేశలింగం గారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| శకుంతల | 1 | 0 |
| రత్నావళి | 0 | 8 |

వడ్డాది సుబ్బారాయుగారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| వేణీసంహారము | 1 | 0 |

## ఆంధ్రనాటకములు.

| | | |
|---|---|---|
| శకుంతల | 1 | 0 |
| చండకౌశిక హరిశ్చంద్ర | 0 | 12 |
| విక్రమోర్వశీయం | 0 | 8 |

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| బొబ్బిలి యుద్ధము | 1 | 0 |
| మహాభారత యుద్ధము | 1 | 0 |
| భోజరాజ విజయం | 0 | 8 |
| శ్రీనాధ కవిరాజీయం | 0 | 12 |

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శాస్త్రిగారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| రసపుత్ర విజయము | 1 | 0 |
| రాణా ప్రతాప్‌సింగ్ | 1 | 0 |

చిలకమర్తి లక్ష్మీనరసింహం గారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| గయోపాఖ్యానము | 0 | 8 |
| ప్రసన్నయాదవము | 0 | 8 |
| పారిజాతాపహరణం | 0 | 8 |
| చతురచంద్రహాస | 0 | 6 |
| పార్వతీపరిణయం | 0 | 6 |
| స్వప్నవాసవదత్త | 0 | 6 |

బలిజేపల్లి లక్ష్మీకాంతం గారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| సత్య హరిశ్చంద్రీయం | 1 | 0 |
| సాత్రాజితీయము | 0 | 14 |
| ఉత్తర రాఘవము | 1 | 4 |

వలయువారు :— కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

ఆంధ్ర నాటకములు.

బుద్ధిమతీ విలాసము 1 0

కాళ్ళకూరి నారాయణరావు గారిచే రచింపఁ బడినవి.

చింతామణి 1 0

వరవిక్రయము 1 0

మధుసేవ 1 0

పద్మవ్యూహము 1 0

శతావధానులు, తిరుపతి వేంకట కవులచే రచింపఁబడినవి.

పాండవవిజయము 1 0

పాండవోద్యోగము 1 0

పాండవాశ్వమేధము 1 0

పాండవప్రవాసము 1 0

ముద్రారాక్షసము 1 0

చందాల కేశవదాసుగారిచే రచియింపఁ బడినవి.

కనకతారా నాటకం 1 4

బలిబంధనము (క్రొత్తది) 1 4

కాళ్ళకూరి సాంబశివరావుగారిచే రచియింపఁబడినవి.

రంగరాయకదనసమవాకార మను బొబ్బిలియుద్ధము 1 0

కన్యకాపరమేశ్వరి 1 0

ఆకెళ్ళ సత్యనారాయణగారిచే రచియింపఁ బడిన

జయాంజయపాలము 0 12

ఆంధ్రనాటకములు.

ఉమ్మెత్త అలీషాకవిగారిచే రచియింపఁబడినవి.

విచిత్ర బిల్హణీయము 0 12

మణిమాల (క్రొత్తనాటకం) 0 12

వల్లూరి బాపిరాజుగారిచే రచియింపఁబడిన

సుగుణమణి 0 10

కొప్పరపు సుబ్బారావుగారిచే రచియింపఁబడిన

రోషనార (జహ్వారీబాయి) 1 0

విశ్వనాథ సత్యనారాయణ గారిచే రచియింపఁబడిన

నర్తనశాల (కీచకవధ) 1 0

సెట్టి లక్ష్మీనరసింహం, బి. యె. గారిచే రచియింపఁబడిన

లుబ్ధాగ్రేసరచక్రవర్తి. హాస్య రసమైననాటకం 0 8

పామర్తి బుచ్చిరాజుగారిచే రచియింపఁబడినవి

సంగీతజగన్మోహిని 1 0

అలీబాబాఅదృష్టవిజయం 1 2

ముత్తరాజు సుబ్బారావుగారిచే రచియింపఁ బడిన

శ్రీకృష్ణతులాభారము 1 0

వలయువారు:— తురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

